# వినయప్రభ

## రంగం-1

[ పాతపంథీరీగా ఉన్న ఒక యింట్లో గది. హేమగిరీ, కంతాలమ్మా, కుర్చీలమీద కూచుని మాట్లాడు కుంటూ ఉంటారు. ]

కం—ఏమో! నన్నడిగితే, మీపట్టింపు మరీ, పెద్ధ మండీ! శాస్త్ర కలాసాకోసం ఎవరు పట్నం వెళ్ళిరాకుండా ఉంటారూ? అల్లా వెళ్ళిరానివాళ్ళని, మనల్నితప్ప, మెడ మీద తలకాయి ఉన్నవాళ్ళని మరోళ్ని చూపించండి! ప్రతీ శీతగట్టునీవెళ్ళి వరాహమ్మ ఇద్దరుకూతుళ్ళూ, చివరికి మన పొరుగావిడ ఘంటాలమ్మాకూడా, నెలేసిరోజులపాటు పట్నంలో ఉండి నాజూకుమీరి నచ్చేసెయ్యడం లేదూ?

హే—అవును, వచ్చేస్తున్నారు. ఆ వచ్చేటప్పుడు మొగతా పదకొండు నెలలకీ సమృద్ధిగా సరిపోయే బాబూ టుకర్కా- పోగుచేసుగుని చక్కా-వస్తున్నారు. పట్నంలో ఉన్న మూర్ఖత్వం ఉన్నచోట ఉండక ఊరేగడం ఎందుకో ఆశ్చర్యం అనిపిస్తుంది. నా చిన్నతనంలో బస్తీపైత్యాలు నిమ్మళంగా పాకేవి, నాయనకి. ఇప్పుడు అంటీబళ్ళని మించి పరిగెడుతున్నాయి. గ్రామాలల్లో [illegible] [illegible]

పెట్టెలకి పెట్టెలు దిగుతున్నాయి, బస్తీపటాటోపాలు, పల్లె ప్రాంతాలకి.

కం—సరే. మీచిన్నతనం రోజులూ మీారూ చాల్లె స్తురూ, అడగాలిటా! మీారు ఆరోజులు గురించి చెప్పి చెప్పి మమ్మల్ని చంపేస్తున్నారు. మనం ఈకొంపలోనే పాతుకుపోయాం మాంబరి! పైకప్పు సణుక్కుంటుం^ండే ఆ పాతకొంపేగా మనదీ! ఎవళ్ళేనాంచూసి ఇది హోటలు అనుకోగల్రు కూడానూ! మన్ని చూడొచ్చేవాళ్ళు ఆట్టే లేరు. వచ్చేవాళ్ళలోకల్లా మహామహులు ఎవరంటే — అర్చకుడిపెళ్ళాం ముసిలి మీానమ్మగారు ఒకస్త్రీనూ, భగవత్ శాస్త్రంనేర్పే కంటికూనయ్య ఒకడూనూ! మీారు చెప్పే తుక్కుగాధలసోదె, మాకు కాలక్షేపం! నాకు ఈ పాత ముసిలి తుక్కుబనాయింపంటే పరమ అసహ్యం.

హే—నాకు ఎంతోఇష్టం. పూర్వకాలపు ఏదైనా సరే నా కిష్టమే. వెనకటి స్నేహితులు, వెనకటి రోజులు, వెనకటి ధోరణులు, పాతపుస్తకాలు, పాతసారాయి. సరి — ముసిలిభార్య అంటేకూడా నా కిష్టమని — (చెయ్యిపట్టుకో బోతూ) నువ్వు ఒప్పుగుంటా వనుకుంటాను.

కం—ఆ. దొరికాల్లేస్తురూ పెళ్ళాన్ని, ఎల్లాగ తేం! మీా ముక్తాయింపు ఎప్పుడూ నామీాదా, ముసిలి పెళ్ళాం మీాదానూ. మీారు తాతయ్య అయూరేమోకాని, నేను తాతమ్మని కాలేదు. అనుకుంటనిజం. [illegible] ముసిలి [illegible]

అవుతాననుకున్నారా? కాను, అయినాసరే ఒప్పుగోను. నావయస్సుకి ఒక్కసంవత్సరం ఎక్కువేసి చెప్పినా ఒప్పుగోను. ఉండండి నే చెబుతాను. ఇరవై...ఆఇరవైకి మరో ఇరవై కలపండి. ఫలితం ఏమవుతుందో చూసుగుని మీరే జుర్రుకోండి.

హేం—ఉండుండు, నేను కలిపి చెబుతానుండు. ఇరవైకి ఇరవై కలపగా, యాభై ఏడు అవుతుంది, నికరంగా!

కం—ఛీ. అబద్ధాలాడకండి, ఊరికేను. నా మొదటి భర్తకాలంలో, మా లకుముకి — నావరహాలమూట, నా కడుపున పడ్డప్పుడు, నాకు వయస్సు ఇరవై. వాడి కిప్పుడింకా గాయకం బాగా రాలేదాయె!

హేం—ఇహనూ ఛస్తేరాదు, నాదీ పూచీ! అంత చక్కని తరిఫీయతు ఇచ్చావు వాడికి, నీ పుణ్యమాఅంటూ.

కం—పీడాపోయింది లేస్తురూ! నా చిట్టిలకుముకికి బోలెడంత ఐశ్వర్యం ఉంది. నాకొడుకు పొట్టపోసుగోడానికి చదువే అక్కర్లేదంటాను. సాలుకి పదిహేనువందలు మార్చుగుని తినడానికి కుర్రపాడగట్టుకి పెద్దచదువు అవసరమేమిటి పోదురూ!

హేం—చదువా అన్నావు? వాడి కొచ్చిందాన్ని చదువని పిలవకూడదు. అది జిత్తులూ అల్లరీ గుచ్చెత్తిన ఒకానొక పొగరువిశేషం.

కం—అయ్యో, మీకేం తెలుసూ? అదే స్వారస్యం అంటారు. వాడిది స్వారస్యం తప్ప మరేమీకాదు. అవతళ

పసిబాలుడు కాస్తంత స్వారస్యం కనపరుస్తూంటే, మీరు కాస్తంత చూసీచూడనట్టు వ్యవహరించాలి, మరీ!

సే—స్వారస్యం కనపరుస్తూంటేకాదు. కొంచెం గాడిదిగత్తర చేస్తూంటే ఒప్పరికించాలి — అను. నడక నాకర్ల చెప్పులు పొయ్యిలో పెట్టడం. దాసీవాళ్ళని ఝళి పించడం, పిల్లి పిల్లల్ని బాధించడం గనక స్వారస్యం కింద జమకట్టుగుంటే, వాడికి కావలిసినంత స్వారస్యం ఉంది. నిన్న నంటే నిన్న, నే కనిపెట్టకుండా నా నవరంయొక్క కొనభాగం దొరకపుచ్చుగుని కుర్చీకి ముడిపెట్టాడు. ఇంతలో త్రివేణమ్మగారు వచ్చింది. ఆవిడికి వందనంచేసే ఉద్దేశంతో నేను తలముందుకి ఇట్టే వంచేసరికి, నవరం వెనక్కి లాగేసినట్టై ఆవిడ మొహంమీద నాతల, బొప్పాయికాయిలాగ తయారై ఊరుకుంది.

కం—అందుకు నన్నా అనడం? అసలు ఆ నెత్రి నాగమ్మ మంచిపన్లు చెయ్యాలనుకుంటాడుగాని, వాడి ఒంట్లో నసిగా ఉండదు. బడిఅంటే వాడికి ప్రాణపోకట. వాడికి కాస్త ఒళ్ళు దురపడ్డతరవాత, ఒకటిరెండేళ్ళు గనక వాడు సంస్కృతంవంటిది చదివిపారేస్తే ఎంతటివాడు కాగలడో ఎవడెరుగును?

హే—సంస్కృతమా? వాడా? అయ్యోరాత! బిడాలమూ, ఛిడేలు వాయింపూనూ! అబ్బెబ్బే! పాసశాలా పశువులశాలానూ ఎప్పటికేనా వాడెళ్ళే పాఠశాలలు!

కం—చాలు ఊరుకోండి. ఆ వెర్రిబాగులవాణ్ణి మనం ఇప్పట్లో అదనూయిస్తూ కూచోకూడదు. ఏమంటూరా, (దీనంగా) వాడు మనికి ఆప్టేకాలం దక్కడు. వాడి మొహంకేసి చూసేసరికి వాడికి క్షయవ్యాధి అన్నమాట ప్రతీవాళ్ళకీ బోధపడుతుంది.

పే—ఆ. దివ్యంగా బోధపడుతుంది. బాగా కొవ్వెక్కి ఉండడమనేది క్షయలక్షణాల్లో ఒకటి అయితేనూ.

కం—అప్పుడప్పుడు వాడికి దగ్గుకూడా వస్తుంది.

పే—తాగేటప్పుడు కొలమారినప్పుడల్లా.

కం—వాడి ఊపిరితిత్తులు ఎమైపోతాయో అని నాకెప్పుడూ భయమే.

పే—నాకూఅంతే. ఎంచేతంటే వాడు ఒక్కొక్కప్పుడు బాకాపట్టినట్టు రేవెట్టి ఊదడం ఆరంభిస్తాడు.

(తెరలో లకుముకి అరుపు వినిపిస్తుంది)

—(కుడిఎదరకి చూసి) అడుగో! చాలా క్షయతో ఉన్నాడు, నిశ్చయంగా.

ల—(కుడిఎదరనించి వస్తాడు)

కం—ఓరి నా, కూనా! లకుముకీ! ఎక్కడికి వెడుతున్నావురా, నా మోహనం! మీ నాన్నకీ నాకూ నీ సాంగత్యభాగ్యం కలిగించరా, నాచిన్ని!

ల—అమ్మా! నాకు చాలా తొందరగాఉంది. ఆగడానికి వీల్లేదు.

కం——గాలి బాగుండలేదు. బయటికి వెళ్ళకురా, నాకన్నవాడా! నువ్వు భయంవేసేటట్టు కనపడుతున్నావురా, మనీషా!

ల——నేను ఆగడానికి వీల్లేదని మళ్ళీ చెబుతున్నాను. కపోతభవనంలో నాకోసం కనిపెట్టుగుని ఉంటారు. అక్కడ చాలా తమాషాగా ఉంటుంది.

హే——అవునవును. ఆ భవనమే పానశాల. నీకు పాతస్థలమే. నేను అంతే అనుకున్నాను.

కం——అక్కడ చేరేవాళ్ళంతా నీచులు, నాసరకం ముతావాళ్ళూనూ!

ల——ఆఁ అంత నీచులుకారు! ఘరానావాళ్ళే. తయారీ సరుకులమీద పన్ను లుచ్చుగునే జాకు మాగయ్య, గుత్తాలకి రోగాలుకుదిర్చే జాకెట్ల అపభ్రంశం. సంగీతయంత్రానికి 'కీ' యిస్తూండే పొట్టి గూటయ్య, తగపెప్పు పళ్ళెంపన్లకి చక్రంతిప్పే మర్లు మారయ్య — లాంటి వాళ్ళున్నారు.

కం——నాచిట్టీ, నీకు దణ్ణం. ఈ ఒక్కరాత్రి వాళ్ళకి ఆశాభంగం చెయ్యి.

ల——వాళ్ళకి ఆశాభంగం కలిగించడానికి నేను బాధపడతాననికాదు. నాకు ఆశాభంగం కలిగించుగోడానికి నేను ఒప్పను.

కం——(అతణ్ణి పట్టుగుని, ఆపుతూ) నువ్వు వెళ్ళా యిస్తుకాదు.

ల—నేను వెళ్ళితీరతాను, చెబుతున్నాను.

కం—నువ్వు వెళ్ళ వీల్లేదని చెబుతున్నాను.

ల—అయితేచూద్దాం, నువ్వు బలాసివో నేను బలాసినో! (ఆవిణ్ణి బరబరా ఈడ్చుగుంటూ RFకి వెళ్ళి పోతాడు).

హే—(తనలో) ఒకళ్ళ నొకళ్ళు దుర్మార్గంలోకి ఈడ్చుగుంటూ నడిచారు, మాతాపుత్రులు! కాలంలోనే ఉందేమో ఈకుట్ర! ఇంగితమూ విచక్షణా ఎగిరిపోయాయి. (LF కేసి చూస్తూ) అదుగో నాచిట్టి వినయ! ఈకాలపు వేషాడంబరం దీనికికూడా సంక్రమించింది. ఏడాది రెండేళ్ళు పట్నంలో ఉండేసరికి, దానికికూడా ఉలిపొరకాగితాలు లాంటి ఫ్రెంచి జరీలమీద ఎక్కడలేని వ్యామోహమూ కలిగింది.

[ L F నించి వినయ వస్తుంది ]

—నా చిన్నిఅమాయికురాలా, చిరంజీవి. ఆవేషమే వేసేసుగున్నావా, వినయా! దైవమా! ఎంత పట్టు సరంజాం అధికంగా చుట్టబెట్టుగున్నావమ్మా, తల్లీ! ధనాడంబరం గలవాళ్ళు అనవసర వేషాదికం తగ్గించుకుంటే, దాంతో యావత్తు దరిద్రసంఘానికీ వస్త్రధారణం చేకూరుతుందని, నేటికాలపు మూర్ఖులకి ఎల్లా బోధపడుతుంది!

వి—మన ఒప్పందం జ్ఞాపకం తెచ్చుగోండి, నాన్నా. నేను ఎవర్నేనా కూడవెళ్ళినా సన్నవరేనా చూడొచ్చినా,

నా చిత్తంవచ్చిన వేషం వేసుగోవచ్చు నన్నారుగా! ఇంటి దగ్గిర మీా ఇష్టప్రకారం సాదా వేషం ధరిస్తాను.

హే—అవును, సరే. ఆమాట తూచా తప్పకుండా పాటించాలిసుమా. అన్నట్టు కాస్సేపట్లో తెలిసిపోతుంది, ఈమాట నువ్వు ఎంతవరకూ శిరసా వహిస్తావో!

వి—మీా రనేది నాకు అవగాహన కావటం లేదండీ!

హే—అయితే, విను, వినయా, ఉన్నసంగతి చెప్తున్నాను. ఒక అబ్బాయిని నీకు భర్తగా చెయ్యదలిచాను. అతడు పట్నంనించి ఈవేళే దిగుతాడు. అతడు బయల్దేరేశాడని, వాళ్ళనాన్నే నాకు ఉత్తరం రాశాడు. రాసి, తను కూడా త్వరగలో కొడుకు వెనకాలే వస్తానన్నాడు.

వి—నిజంగానేనా, నాన్నా! అయితే మరి, ఈ సంగతి గురించి నాకు కొంచెం ముందుగా తెలియవలిసింది. నాయిల్లు బంగారమైతే, నే నిప్పుడెల్లా యిదవనూ? తొంభైతొమ్మిదిపాళ్ళు అతడు నాకు నచ్చడు. మా, సమాజవేశం ఏదో లాంఛనం కింద అవుతుంది, జరుగుతుందన్నారు గనక జరుగుతుంది. అందువల్ల స్నేహ గౌరవాలు ఎక్కువవడానికి వీలుకనపడదు.

హే—నమ్ము అమ్మాయి. నీ ఇష్టంగురించి నేను చూడ్డాను తీర్పను. కాని, నీకోసం నేను నిర్ణయించింది ఎవర్ననుకున్నావు? నీతో బోలెడుసార్లు చెప్పాను, నా స్నేహితుడు పెదరాజుగారని,—ఆయనకొడుకే. ఆ అబ్బా

ఘుని గాంగా చదివించారట, దేశసేవక వర్గంలో ఒక పెద్ద ఉద్యోగం అతనికి సంకల్పించారట, అతడి అవగాహనశక్తి అమోఘమైందిట.

వి—అంతటివాడా ?

సే—చాలా ఉదారస్వభావం గలవాడుట.

వి—అయితే నాకు నచ్చవచ్చు.

సే—ధైర్యసాహసాలు గల యువకుడుట.

వి—అయితే నాకు తప్పకుండా నచ్చుతాడు.

సే—చాలా అందగాడుట.

వి—నాన్నా, నాన్నా! మరి చెప్పకండి. (అని అతడి చెయ్యి ముద్దెట్టుకుంటూ) అతడు నాస్వంతమే, అతడే నాకు కావలసింది.

సే—అన్నింటికీ ప్రధానమైన విషయం ఏమిటంటే, వినయమూ, అతనికున్నంత సభాపిరికితనమూ, మొహమాటమూ గలవాళ్ళు భూమ్మీద ఎక్కడా ఉండరుట.

వి—అరెర్రే! అదేమిటి నాన్నా! ఈ ముక్కతో నా ఆశలన్నీ కూలిపోయినాయి. ఆయనకి ఎన్ని లక్షణాలున్నా, మొహమాటం అనేది వాటికన్నింటికీ విరుగుడు. ముఖ్యంగా ఊరక పెళ్ళికొడుకు సాధారణంగా అనుమానించే భర్తగా తయారవుతాడు.

సే—ఆమాట యథార్థానికి కేవలం విరుద్ధం. ఏమంటే, మహాసుగుణాలు సంపాదించని హృదయంలో ముఖా

వత్సానికి చోటేఉండదు. అతని శీలంలో మొదట్లోనే నాకు అత్యద్భుతంగా కనిపించిన ఒక మహాలక్షణం ఏదీ అంటే అదే.

వి—అంతకంటె అద్భుతతరమైన లక్షణాలు ఏవేనా ఆయనకి ఉంటేగాని నన్ను బంధించలేవు, నాన్నా! ఈమాట పూచీపడి చెప్పగలను. కాని ఏమటుకానీండి, అటువంటి యువకుడుగనక, అల్లా అల్లా ఉన్నాడని మీరే చెప్పారుగనక, ఫరవాలేదనుకుంటాను. అతన్ని ఎన్నుకో వచ్చు, నేను.

హే—అయ్యో, వినయా! ఇంతటితో కాదసలు. ఆటంకం మరోటిఉంది. అతడు నిన్ను వరించకపోవచ్చు. వరిస్తాడని మనం పందెం కాసినా నెగ్గం!

వి—అయ్యో! నాన్నగారూ! ఎందుకని నన్నిల్లా మాడ్చడం? ఆయన నన్ను వరించడే అనుకోండి. ఆయన నిర్లక్ష్యానికి నేను కుంచెపగిలిపోను. ఇన్నాళ్ళనించీ, నన్ను ఉచ్చేసిన అర్థాన్ని పగలకొట్టేస్తాను, మరో నాజూకు నీతి అవలంబించి వేషంవేసి, ఇంత కఠినుడు కాకుండా నన్ను మెచ్చేవాణ్ణి వెతుక్కుంటాను.

హే—సమస్య ఒక్క దెబ్బతో విడగొట్టావు! సరే, నేవెళ్ళి అతనికి స్వాగతం ఇవ్వడానికి మన నౌఖర్లని తరిఫీయతు చేస్తాను. మన్ని చూడవస్తాండేవాళ్ళు మనకి అట్టే ఉంటూఉండరు గనక, ఈనౌకర్లకి ఎంత

శిక్షసైనా కావాలి, యుద్ధంలో చేరినవాళ్ళకి మొదటిరోజు మస్తరు వెయ్యడానికిలాగ! (R F కి వెళ్ళిపోతాడు.)

వి—(తనలో) నాన్నగారు చెప్పిన వార్తతో నేను కంగారులో పడిపోయాను. యవ్వనం, సౌందర్యం—ఇవి నాన్నగారు చివరకి రానిచ్చారు. కాని, నేను వాటిని ముదకే వేస్తాను. తెలివి, సత్స్వభావం—లాంటికడం అన్నీ ఒప్పుగుంటాను. కాని, మొహమాటం పిరికితనం—అతనికి చాలా ప్రతికూలం. అయితే పెళ్ళాన్ని చూసుగుని గర్వ పడడం అతనికి నేర్పితే, క్రమేపీ పిరికితనం వొదిలిపోకుండా ఉంటుందా? ఓ! పైగా, నేను...సరిసరి...నేను మరీ వేగంగా పురోగమిస్తున్నాను. పెళ్ళికొడుకు చేతిలో పడందే భర్తగురించిన ఖంజాయింపులు చేస్తున్నాను.

[LM నించి, రంజని వస్తుంది]

—రావో, రంజనివొదినా, రా! చాలాసంతోషం! నేనిప్పుడు ఎల్లాఉన్నానో చెప్పు! నా మొహంలో ఏమన్నా వికృతంగా ఉందా? నేనీ రోజున సరళంగా కనిపిస్తున్నానా? ఈరోజున బాగాఉందా నాముఖం?

రం—పూర్తిగా అందంగా ఉంది, విసయా! పోనీ మళ్ళీ చూస్తానుండు—అయ్యబాబో—ఏమిటికథ? అల్లా ఉన్నావేం? నీ పెంపుడుపిట్టలక గాని పెంపుడు చేపలకి గాని ఏమీ ప్రమాదం రాలేదుకద! నీ అన్నగాని, నీ పిల్లిగాని అల్లరి చెయ్యలేదుకద! లేక నువ్వు చదువుతూన్న నవల నీ హృదయాన్ని కలచలేదుకద!

వి—అబ్బెబ్బే! అదేమీ కాదు, రంజనీ! ఇప్పు డిప్పుడే గ్రహించగలిగాను — ఒక పెళ్ళికొడుకుని నాకు చూపిస్తాం అని నన్ను జడిపిస్తున్నారు.

రం—అతని పేరు?

వి—రత్నమణి!

రం—నిజంగా!

వి—పెదరాజుగారి కుమారుడట.

రం—ఓహ్హో, అవును! నన్ను మెచ్చుగునే హృదయ నాథంగారికి చాలా అంతరంగ స్నేహితుడుట. వాళ్ళిద్దరూ ఒకళ్ళనొకళ్ళు విడిచిఉండరు. మనం పట్నంలో ఉన్నప్పుడు అతణ్ణి చూసిఉంటావు.

వి—లేదే!

రం—ఆయన ఒక విపరీతాభిప్రాయ వ్యక్తి, నాకు బాగా తెలుసు విను. పేరుప్రతిష్ఠలూ గుణసంపదా గల స్త్రీల సమ క్షంలో ఆయనంత మొగమాటస్థుడు ఉండబోడుట! ఆయన్ని ఎరుగున్నవాళ్ళు ఇంకా ఏమని చెబుతారంటే, అతను మరొక మోస్తరు మనిషిలా ఉషారుగా ఉండడు మరొక రకపు స్త్రీజనంతో ఉన్నప్పుడుట! నీకు బోధపడిం దను కుంటాను.

వి—అల్లానా! చాలా అద్భుతవ్యక్తే! నేను అతణ్ణి లొంగదియ్యడం! ఏమిటి చెయ్యను? ఛీ, పోనిస్తూ. అతణ్ణిగురించి ఆలోచనే మానుకుంటే సరి. ఏదో ఓటి జరిగి

నెగ్గుతానను ... ను. అయితే, నెచ్చెలీ, నీ వ్యవహారం ఏ కాడికొచ్చింది? నా సవితితల్లిగారు ఎప్పటిలాగే ఉందా? నా సవితన్నయ్యని పెళ్ళిచేసుకోమని నిన్ను చంపుకు తింటోందా?

రం—కాస్సేపు ఇచ్చకాలు మాట్లాడుకుని అక్కణ్ణించే వస్తున్నాను. మీ అన్నయ్యయొక్క కోమలత్వం గురించి మీ అత్త వస్తరం విప్పేసింది. తనకొడుకు చక్కటి భూతం వంటివాడైనా, వాడు పూర్ణావతారం అని ఇతరులు అనుకోవాలని వర్ణన చేసేస్తూంటుంది.

వి—వర్ణనచేసి ఊరుకోడమే కాదు, తనపక్షపాతం కొద్దీ, ఆ వర్ణనప్రకారం వాడున్నాడని యథార్థంగా నమ్ముతుందికూడానూ! కాస్త కూస్త ఆశకలిగించడానికి నీఆస్తి సామాన్యమైందామరీ! పైగా, నీఆస్తి చక్కపెడుతూంటూ తనేగనక, అదంతా కుటుంబం దాటి వెళ్ళిపోడం అనేది ఆవిడికి ఇష్టం ఉండకపోడంలోనూ ఆశ్చర్యంలేదు.

గం—అంతో బ్రహ్మాండమైన ఆశ కలిగించడానికి, నాఆస్తి ...సుంతి చేస్తూ, నగలేకదా! పోనీ అవేఆయిరి అంటే, ... ...దయనాధంగారు తిరిగిపోకుండా నిలిస్తే, చివరకి నేవాడ్ని దగ్గ చేసెయ్యడం రూఢి. అయినా ఎందుకేనా నయ... ...కునే ప్రేమిస్తున్నానని అనుకునేటట్టు నటిస్తు...ను. నా హృదయం వెళ్ళి మరోచోటు స్థిరపడిందని, ... ... తెలియదు.

వి—మా సవితన్నయ్య తనమాటకి నిలబడతాడు. నిన్ను అతడు వద్దు పొమ్మనడం తెల్సుగుంటే, అతడిమీద నాకు ఇష్టంకూడా బయల్దేరుతోంది.

రం—అవును, పాపం. అతడు స్వతహా చాలా మంచి స్వభావం కలవాడు. నన్ను తనకి తప్ప, మరొకరికి ఎవరికేనాసరే, యిచ్చి పెళ్ళి చేసేస్తే చూడాలని, ఆశానికి ఉంది—అని నానమ్మకం. అదుగో అత్త గంటకొడుతున్నా నడు.

వి—(కుడి ఎదటికి చూస్తూ) పైగా అన్నయ్య వస్తున్నాడు తూలుస్తూ.

(ఇద్దరూ ఎ. మ. కి పోతారు. రెండో తెర పడుతుంది.)

[కుడి ఎదటినించి లచుముకి తూలుతూ
పాడుకుంటూ వస్తాడు]

కపోత భవనం
అపూర్వ సుఖదం
మనసుకి మోదం
దినుసు వినోదం ॥క॥

పానం సేయక
జ్ఞానం తెలియదు
పాననిషేధం
జ్ఞాన నిషేధమె ॥క॥

తాంగా తాంగరు
తాంగానివ్వరు
అనసి పాలనుం
వంతా ఈగ్యే ||క||

(ఎడమ ఎదటికి నడిచి నిష్క్రమించ బోతూంటే, కు. ఎ. నించి "ఏయ్, ఏయ్!" అని కేకలు వినిపిస్తాయి. లకుముకి వెనక్కి తిరిగి, కు. ఎ. నిష్క్రమించి, వెంటనే మళ్ళీ రాగా, వెనకాలే రత్నమణీ, హృదయనాథం వస్తారు.)

ర—అబ్బా, రోజంతా తాసు తెగిపోయింది, ఇంకా ఎనులకొంపాలుంది ప్రయాణం. నాటుని ఈ అష్టదారి నల్లపై మెళ్ళిన్నారు, ఇక్కడికి అరవై మైళ్ళపైగా వస్తిమి.

హృ—ఏరుకో, రత్నమణీ! నీమాటలాన్నే ఇదం తాసూ, ఎందుకో తెలియని నీమొహమాటమే ఇంత తెచ్చిపెట్టింది. దారివెంట కొంచెం కొంచెం వాకబుచేసి కనుక్కుంటాను అంటే, వద్దని అడ్డుకొట్టింది నువ్వేగా?

ర—నిజమే హృదయనాథం! వీధులో కనపడే అష్టమైనవాణ్ణీ ఏదో ఒకటి అడిగి వాడికి ఋణపడవలిసి రావటం నాకు ఇష్టంలేదు. ఒక్కొక్కప్పుడు అవతలవాడు ... మోటుగా జవాబిచ్చి నన్ని ఈ ... చూడాలా.

హృ—లేకపోతే అసలు ఏజబాబూ ఉండదు. ...?

ల—అయ్యో!

హ్యా—ఈప్రాంతాన్ని హేమగిరిగారి భవనంలు మీకు తెలుసా ?

ల—సరేగానండి! మీరు ఈచుట్టుప్రక్క-ప్రదేశం ఎదో ఎరుగుదురా ?

హ్యా—ఎంతమాత్రం ఎరగనండి. ఈ స్థలం చెప్పారంటే చాలా కృతజ్ఞులం.

ల—సరేలెండి, మీరు ఏదాన్ని వచ్చారో ఆ దేశా ఎరుగున్నారా ?

హ్యా—అబ్బే, తెలియదండి. ఒక వేళ, మీకు...

ల—అయితే ఒకమాట చెప్తానండి, అయ్యగారూ! మీరు ఏదారివెంట వెళ్ళాలో తెలియక, ఏచోటి కెళ్తున్నారో తెలియక, ఏదార్ని వచ్చారో తెలియక, ఉన్నారు. మీతో ఒకసంగతి చెప్పదల్చాలను కున్నాను ముఖ్యంగా మొదట — పోతేపోయింది. అదేమిటంటే, మీరు దారి తప్పిపోయి ఉండాలి.

ర—ఏపిశాచమూ రానూక్క-ష్టేమా. ఆసంగతి మాతో చెప్ప అక్కర్లేదు.

ల—పోనీ, తమరు ఏస్థలంనించి వస్తున్నారో దాని పేరేమిటి అని, మిమ్మల్ని అడగటానికి నేను సాహసించవచ్చునా ?

ర—వెళ్ళవలిసిన చోటు మాకు చూపించటానికి మీరు వచ్చిన స్థలంసంగతి అనవసరం.

ల—కోప్పడకండి, ప్రశ్నకి ప్రశ్న న్యాయంకదా! అందుకని నేను అడిగాను. అయితే, స్వాములూ, ఒక సంగతి చెప్పండి. హేమగిరిగా రన్నారే, మీరూ? హేమగిరిగా రంటే, ఒక కోపధాటి పాతపంథిణీ పైత్యకారి ఘటం కాదూ, అంట మొహం వాడూనూ! ఆతడికి ఓకూతురూ, మన్మథుడులాంటి కొడుకూనూ! ఏం?

హ్యా—ఆయన్ని మేం చూసిఉండలేదు. కాని నువ్వు చెప్పిన సంతానం ఆయనకి ఉన్నారు.

ల—కూతురు పొడుగ్గా దూబరావేషంతో చుట్టూ రంగేళీలతో తక్కుతూ తారుతూండే వాగుడుకాయి! కాదూ? కొడుకు, మంచి ఆరిందా నేర్చి, అందరికీ నచ్చుతూ ప్రతీవాళ్ళూ ఇష్టపడేటట్టు ఉంటాడు, ఏం?

ర—మాకు తెలిసిన వృత్తాంతం కొంచెం వేరు! కూతురేట అందంగాఉండి మర్యాదలు నేర్చుగున్నది! కొడుకేట, కోతిమొహం నాయిహా ఏడిసినట్టుండి, తల్లిగారా బంవల్ల తగులడి పసువై పోయిన దిక్కుమాలాడు!

ల—ఒహో, అల్లానా! మీరు అల్లావిన్నారా! ఎమైతేం, పాపం, ఉన్నసంగతి ఇదీ, మీరు ఆ హేమగిరి ఇల్లు ఈరాత్రికి జేరుకోరు.

హ్యా—మా దురదృష్టం!

ల—ఆదారి, అబ్బో చచ్చేటంతదూరం, చీకటి, బాడి, బండ, బురద, రొచ్చు, భయం — దిక్కుమాలిదారి. అదేనా మరోర్ని కనుక్కోండి చూపిస్తారు.

హ్రా—తమరే చూపిస్తురూ, దయచేసి.

ల—అసలు మీరు చాలా తప్పుడుగా వచ్చేశారండీ. ఆ గుట్టమొదటి కొచ్చారా, అక్కణ్ణించి ఓసంద దాటవలిసింది.

ర—సందా ?

ల—తరవాత ముక్కుకి సూటిగా పోవలిసింది, నాలుగురోడ్ల కూడలిదాకా.

హ్రా—అల్లాగా ?

ల—కాని, ఆ నాలుగురోడ్లలోనూ ఒకదానిమీదే నండోయి, మీరు పోవలిసింది.

ర—ఓరబ్బో, మీరు బాగా చమత్కరిస్తారే!

ల—అక్కణ్ణించి కుడివేపు మళ్ళి, పక్కలమ్మట నడిస్తే ఓమైదానం వస్తుంది. అక్కడ తెలివితేట లుపయోగించి బళ్ళదారి పట్టుగోవాలి. దానివెంట నడుచుకుంటూ పోతే ఓగాది తగుల్తుంది. అక్కడ కుడివేపు మళ్ళి, మళ్ళీ ఎడమకి మళ్ళి, కుడిమీదుగా వెనక్కిమళ్ళితే పాతమర దగ్గిరికి వస్తారు.

ర—ఆ స్థలానికి అక్షాంశరేఖాంశాలు కనుక్కోడం ఇంతకంటె నయంలాఉందే!

హ్యా—మనం ఇప్పుడు ఏంజేద్దాం. రత్నమణీ!

ర—ఈ పక్కనే ఒక హోటలు ఉన్నట్టుంది. మేనే జరు సరేఅంటాడు కాని, మనం ఇరుక్కోవాలేమో!

ల—ఇక్కడా! ఇక్కడ ఒకడుమాత్రమే పడుండ వచ్చు. అదేనా ఖాళీగా ఉంటేనూ!

హ్యా—ఏమిటి దారి?

ల—పోనీ, ఓపని చేస్తారా? మరొక్క మైలు వెడ తారా? గుట్టమీద పెద్ద హోటలుకి పోదురుగాని!

హ్యా—అమ్మ! అల్లాఅయితే, ఈరాత్రి సాహస యాత్ర గడిచాం అన్నమాటే!

ల—మీరు తిన్నగాపొండి. రోడ్డుపక్కనే పెద్ద పాత భవనం ఉంటుంది. తలుపుపైన రెండు కొమ్ము లుంటాయి. అదీ ఆనవాలు. ఆవరణలోకి వెళ్ళి బాగా అరవండి.

హ్యా—అయ్యా! మీకు చాలా కృతజ్ఞులం. మా నౌఖర్లకి తెలుస్తుందా దారి?

ల—ఓ. భేషుగ్గా తెలుస్తుంది. కాని, మీరు కొంచెం వినడం మంచిది. ఆ హోటలు మేనేజరు చాలా గడించాడు, ఇక వృత్తి మానుకోదలిచాడు. అందరూ తన్ని ఓ గొప్పవాణ్ణిగా కట్టాలని బాధపడుతున్నాడు. తెలిసిం దాండి. మీసన్నిధిలో ఇంతకంటె అనకూడదు. వాడు కొంచెం కీకులాట వ్యవహారమే, నిజంగా! కాని అక్కడి

ల—ఆదారి, అబ్బో చచ్చేటంతదూరం, చీకటి, బాడి, బంద, బురద, రొచ్చు, భయం – దిక్కుమాలిదారి. అదేనా మరోర్ని కనుక్కోండి చూపిస్తారు.

హ్యా—తమరే చూపిస్తురూ, దయచేసి.

ల—అసలు మీరు చాలా తప్పుడుగా వచ్చేశా రండీ. ఆ గుట్టమొదటి కొచ్చారా, అక్కణ్ణించి ఓసందు దాటవలిసింది.

ర—సందా ?

ల—తరవాత ముక్కుకి సూటిగా పోవలిసింది, నాలుగురోడ్ల కూడలిదాకా.

హ్యా—అల్లాగా ?

ల—కాని, ఆ నాలుగురోడ్లలోనూ ఒకదానిమీదే నండోయి, మీరు పోవలిసింది.

ర—ఓరబ్బో, మీరు భాగా చమత్కరిస్తారే !

ల—అక్కణ్ణించి కుడివేపు మళ్ళి, పక్కలమ్మట నడిస్తే ఓమైదానం వస్తుంది. అక్కడ తెలివితేట లుపయోగించి బళ్ళదారి పట్టుగోవాలి. దానివెంట నడుచుగుంటూ పోతే ఓగాది తగుల్తుంది. అక్కడ కుడివేపు మళ్ళి, మళ్ళీ ఎడమకి మళ్ళి, కుడిమీదుగా వెనక్కిమళ్ళితే పాతమర దగ్గిరికి వస్తారు.

ర—ఆ స్థలానికి అక్షాంశరేఖాంశలు కనుక్కోడం ఇంతకంటె నయంలాఉందే!

హ్యా—మనం ఇప్పుడు ఏంజేద్దాం. రత్నమణీ!

ర—ఈ పక్కనే ఒక హోటలు ఉన్నట్టుంది. మేనే జరు సరేఅంట్టాడు కాని, మనం ఇరుక్కోవాలేమో!

ల—ఇక్కడా! ఇక్కడ ఒకడుమాత్రమే పడుండ వచ్చు. అదేనా ఖాళీగా ఉంటేనూ!

హ్యా—ఏమిటి దారి?

ల—పోనీ, ఓపని చేస్తారా? మరొక్క మైలు వెడ తారా? గుట్టమీద పెద్ద హోటలుకి పోదురుగాని!

హ్యా—అమ్మ! అల్లాఅయితే, ఈరాత్రి సాహస యాత్ర గడిచాం అన్నమాటే!

ల—మీరు తిన్నగాపోండి. రోడ్డుపక్కనే పెద్ద పాత భవనం ఉంటుంది. తలుపుపైన రెండు కొమ్ము లుంటాయి. అదీ ఆనవాలు. ఆవరణలోకి వెళ్ళి బాగా అరవండి.

హ్యా—అయ్యో! మీకు చాలా కృతజ్ఞులం. మా నౌఖర్లకి తెలుస్తుందా దారి?

ల—ఓ. భేషుగ్గా తెలుస్తుంది. కాని, మీరు కొంచెం వినడం మంచిది. ఆ హోటలు మేనేజరు చాలా గడించాడు, ఇక వృత్తి మానుకోదలిచాడు. అందరూ తన్ని ఓ గొప్పవాణ్ణిగా కట్టాలని బాధపడుతున్నాడు. తెలిసిం దాండి. మీసన్నిధిలో ఇంతకంటె అనకూడదు. వాడు కొంచెం పీకులాట వ్యవహారమే, నిజంగా! కాని అక్కడి

కంటె పానీయాలూ పక్కలూ మరెక్కడా ఉండవు. మీతో వాడుకూడా కూచుంటాడు భోజనానికి. ఇక, మీరు ఊకొట్టడం మొదలెట్టారా, లేవదీస్తాడు గాథలు—తనతల్లి పాలపురాలనీ తన అత్త జడ్జీఅనీ, దంచేస్తాడు!

ర—కానీండి. పానీయాలూ పరుపులూ మాకుంటే, ఇతరసోది మాకు అక్కర్లేదు. మమ్మల్ని కుడివేపా వెళ్ళమన్నారు?

ల—అబ్బె బ్బె! ముక్కుకి సూటిగా వెళ్ళమన్నానండి. అసలు నేచూపిస్తాను పదండి.

(అని, కుడిఎదటికి నడిచివెడతాడు. రత్నమణీ, హృదయనాథాలు వెనకాలే నిష్క్రమిస్తారు. అప్పుడే మళ్ళీ లకుముకి వస్తాడు.)

—వీళ్ళని తిన్నగా మాఅమ్మ భర్తగారింటికి దోవ పట్టించాను. అది హోటలు అనుకుని వీళ్ళు దిగుతారు. ముసిలాడు తబ్బిబ్బు పడతాడు. చాలా మజాగా ఉంటుంది. (అని తనూ కుడి ఎదరకే, వెళ్ళిపోతాడు.)

## రంగం-2

[వీధి గది. గుండ్రని బల్లా దానిచుట్టూ మూడుకుర్చీలూ ఉంటాయి. రత్నమణీ హృదయనాథమూ కూచుంటారు.]

హృ—మణీ! రోజల్లా మనం ఎదురుదెబ్బలే తింటేం గాని, ఎల్లాగో జేరుకున్నాం ఈ హోటలికి. లక్షణమైన గదీ, ఇతర సౌకర్యాలూ! నా ఉద్దేశం ఈ హోటలు చాలాబాగుంది. పాతపురాణమే అయినా, చెప్పతగ్గ ఇల్లే.

ర—ప్రతీ పెద్దకొంపకీ ఇల్లానే కాల్తూంటుంది కర్మం. హద్దులేని ఆతిథ్యంవల్ల యజమాని ఆరిపోగా, కొంప ఇల్లా హోటలుగా మారిపోతుంది. (L M కేసి చూస్తూ) ఇదుగో వస్తున్నాడు హోటలు యజమాని గావును!

[L M నించి హేమగిరి వస్తాడు]

హృ—అయ్యా! తమకిదే నా హృదయపూర్వక స్వాగతం! మీలో రత్నమణిగారు ఎవరు? మీరా? తమకు మరీ స్వాగతం. మీకు తెలుసుకోలేదో స్నేహితులు రాగానే నేనుమాత్రం...సుఖంగా కూచుని ఊరుకోడం నాతత్వంలో లేదు. పాతఫక్కీలో సింహద్వారం దగ్గిరే హృదయపూర్వ కాతిథ్యం ఇవ్వడం నామతం. వచ్చినవాళ్ళ ముల్లే మూటా కూడా వెంటనే జాగర్త చేయించడంకూడా నేనే చూస్తాను.

ర—(హృదయనాథంతో) ఈ డప్పుడే మనపేర్లు నౌకర్లద్వారా తెలుసుగున్నట్టున్నాడు. (హేమగిరితో)

మీజాగర్తా సౌజన్యమూ మాకు నచ్చాయి. (హృదయ నాథంతో) హృదయనాథం! ఈ ప్రయాణవేషం ఇప్పుడే తీసేస్తే బాగుంటుందని అనుకుంటున్నాను. దీన్నికేసి చూసు గుంటూంటే సిగ్గుగానూ కంగారుగానూ కూడా ఉంది.

హే—రత్నమణిగారూ! తమకు నాయింట్లో ఏవిధ మైన పట్టింపూ అవసరంలేదు.

హృ—నిజమే, రత్నమణీ! నాఊహా అంతే. మొదటి ఎత్తు సరిగ్గా వేస్తే యుద్ధం సగం నెగ్గినట్టే! తెలుపుమీాద పసుపంచులతో ప్రారంభించి రంగంలోకి దిగాలని నా సంకల్పం.

హే—అయ్యా, రత్నమణిగారు! అయ్యా, హృదయ నాథంగారూ! అయ్యా! మీారు ఈఇంట్లో ఎంతమాత్రమూ మొహమాట పడవలిసిన అగత్యంలేదు. ఇది స్వేచ్ఛానిల యం, స్వామీ. ఇక్కడ మీా చిత్తానుసారం ఉండవచ్చు.

ర—అవును, హృదయనాథం! మనం ఈ సంగ్రా మం ప్రారంభలోనే భీకరంగాఉంటే, వ్యాపారం పూర్తి కాకుండానే సామగ్రి మనకి లోటురావచ్చు. నాఉద్దేశం, అంచుపనిగల వేషాలన్నీ తరవాత తరవాత ధైర్యంగా తిరోగమించడంలో వాడడానికి ఉంచెయ్యమని.

హే—రత్నమణిగారూ! మీారు తిరోగమించడం అంటే జ్ఞాపకంవస్తోంది. మొన్నటిదికాక, కిందటి యుద్ధంలో, ఓనగరం ముట్టడించడానికి మేం వెళ్ళాం. మాసేనాని మొదట్లో దుర్గ రక్షక సైన్యాన్ని పిల్చి—

ర—అయితే, ఇటికరంగు సాదాషర్టుమీద పసుపు రంగు పొట్టికోటు సరిపోదంటావా ?

హే—మా సేనాని, మొదట్లో దుర్గరక్షక సైన్యాన్ని పిల్చి — అందులో సుమారు అయిదువే లుంటారు—

హ్యా—సరిపడ దనుకుంటాను. ఇటికరంగూ పసుపు రంగూ అతకవు.

హే—వినండి స్వాములూ ! నేను చెప్పేసింది ఏమిటంటే, అతడు దుర్గ రక్షకసైన్యాన్ని పిల్చి — అందులో సుమారు అయిదువే లుంటారు—

ర—యువతీమణులకి డాబు నచ్చుతుంది.

హే—అందులో సుమారు అయిదువే లుంటారు. దండిగా సరుకులూ సామగ్రీ ఇతర యుద్ధ సాధనాలూ ఉన్నాయి. అప్పుడు సేనాని, పక్కనున్న ఉపదళవాయితో— అతణ్ణి బహుశా మీరు ఎరిగే ఉంటారు — ఏమన్నాడంటే; ఇదుగో, అవతల సైన్యాన్ని, మనకి పూరిపుల్లైనా నష్టం లేకుండా, పట్టుగుంటాను. పందెం ! నాఆస్తి పందెం ! — అన్నాడు. అప్పుడు......

ర—ఏమయ్యా ! నేస్తం. మీరు మాకు కాస్త పంచరసం ఇప్పిస్తే, మా ముట్టడి మేం కొంత త్రాణ తెచ్చుగుని సాగిస్తాం.

హే—పంచ రసమా ? (అని, నొచ్చు గున్నట్టు నటిస్తాడు.)

ర—అవునండి. బాగా కలిపిన పంచరసం. తాజా సరుకు ఇప్పించారా, ప్రయాణబాధ పడిపడి ఉన్నామేమో, మహాశమనగా ఉంటుంది. ఇది స్వేచ్ఛాసలయ్యా కదా!

హే—(అప్పుడే పక్కనించి గిన్నె తెచ్చి) ఇదుగో నండి. (ఆశ్చర్యపడి, తనూ ఒక గిన్నె తీసుగుని) మీకిది ఇష్టంగా ఉంటుందని ఆశిస్తున్నాను. ఇది నా స్వహస్తంతో చేసింది. అయిదురసాలూ సమపాళంగానే పట్టాయని నా నమ్మకం. మీరు దయచేసి స్వీకరిస్తారా! ఇదుగోనండి, రత్నమణిగారు, మనమధ్య మరింత దోస్తీకి సూచనగా!

(అని తాగుతాడు)

ర—అయ్యా! తమ సేవకుణ్ణి.

హ్యా—(తనలో) వీడు మాతో కలిసి సూచోవాలని గావును. తను హోటలు మేనేజరుఅనే సంగతి వీడు మరిచి పోయాడు, ఘరానాగా ఉండడం ఇంకా నేర్చలేదు.

ర—(పంచరసంపుచ్చుగుని) ఏమయ్యోయి, ముసిలి అయ్యా, మీరిచ్చినపంచితం చాలా ప్రశస్తంగాఉంది. మీకు ఈ ప్రాంతంలో వ్యాపారం ఎక్కువగానే ఉంటుందనుకుం టాను. బహుశా, ఎన్నికల్లోనూ అప్పుడూ, ఎల్లాబడితే అల్లా ఉంటుంది గావును.

హే—లేదండి. ఆ ఎన్నికలసంగతి చాలా కాలమై వదులుకున్నాను. పెద్దలంతా అవసరాన్ని బట్టి ఒకర్ని ఒకరు ఎన్నేసుగోడం కనిపెట్టుగున్నారు గనక, నావ్యాపారం నే చూసుగు నేటప్పుడు ఎన్నికలంటివాటిల్లో నాకు లబ్ధిలేదు.

ర—అల్లాయితే, మీకు రాజకీయం అంటే ఇష్టం లేదనుకుంటాను.

హే—ఎంతమాత్రం ఇష్టంలేదు. వెనకట్లో, లోకం తోపాటే నేనూ ప్రభుత్వంవాళ్ళ ప్రమాదాలగురించి విసుక్కుంటూ ఉండేవాణ్ణి. ఆరోజు కారోజు నాకోపం మాత్రం జాస్తీఅయిపోవడమే గాని ప్రభుత్వం బాగుపడడం అనేది కనపడిందికాదు. అక్కడితో, రాజకీయాలతో బుర్ర పాడు చేసుగోడం మానుకున్నాను.

హ్యా—అల్లాగా! ఆ తరవాతనించి, మేడమీద తినడం, మేడదిగి తాగడం, అతిథుల్ని ఎదుర్కోడం, బయటి వాళ్ళకి వినోదాలు చూసిపెట్టడం, ఇల్లాగ్గా నీకాలం చాలా హుడావిడిగా నడిచిపోతోంది గావును.

హే—అబ్బో! నిజమే! నేను చాలా హుడావిడి మనిషిని. ఊళ్ళో సగం ముప్పాతిక పేచీలన్నీ ఈ హాల్లోనే పరిష్కారం అవుతాయి.

ర—(మళ్ళీ తాగి) ఈ ద్రావకమేచాలు, నీవాదన కల్లా మూలం, ఏ లాయరూ పనికిరాడు!

హే—మరే అబ్బాయి, మరే. ఇదీనూ ఒకపిసర వేదాంతమూనూ!

హ్యా—వేదాంతంకుడానా నీకూ! అల్లాచెప్పు. ఆరి తేరిన సేనానిలాగ నువ్వు జనాన్ని ఎల్లాపడితే అల్లా తిక్కుతుం టావు. వాళ్ళబుద్ధి కొంచెం లొంగుబాటుగాఉందా, నీ

వేదాంతం ప్రయోగిస్తావు. లేదూ, వాళ్ళు బుద్ధిలేనివాళ్ళవు తారా, ఈ ద్రావకంతో ఎదుర్కుంటావు. ఓ జ్ఞానీ, నీ ఆరో గ్యం గురించి ఇదుగో (అని తాగుతాడు)

హే—బాగుంది. చాలాబాగుంది. (అని నవ్వుతూ) 'సేనాని' అన్నారు మీరు. దాంతో నాకు బాలగ్రామం దగ్గిర జరిగిన మహాసంగ్రామం నెమరకొస్తోంది. అందులో యువరాజు శౌర్యం వినిపిస్తా.

ర—సరి సరి. నీసంగ్రామం ఎవడి క్కావాలి, పోవయ్యా! ఈపాటి మనం భోజన ప్రసంగం ప్రారంభించ డం మంచిది. ఏమేమి వంటకాలు తయారు చెయిస్తోంది నీవేదాంతం, రాత్రి భోజనానికి?

హే—రాత్రి భోజనానికాండీ! (నా యింటికి వచ్చి ఇదేమిటి అన్నట్టు ఆశ్చర్యపోతాడు).

ర—అవునయ్యా! రాత్రి భోజనానికే! నాకు ఆకలి సారేసుగుపోతోంది. ఈవేళ నేను ఉద్యానపు కొట్టులో కెళ్ళి కుమ్మేశానన్నమాటే!

హే—(తనలో) ఛీ ఛీ. ఇంత నిర్మొహమాటపు జంతువుని నే నెక్కడా చూడలేదు. (అతనితో) రాత్రికి వంటకాలా? నాకు, నిజం చెప్పాలంటే, సరిగ్గా తెలియదండి. ఇంటిపెద్దమ్మా, వంటలక్కా అల్లాంటివన్నీ వాళ్ళల్లో వాళ్ళు చూసుగుంటారు. ఇల్లాంటి విషయాల్లో నేను కలగజేసు కోను.

ర—అల్లాగా! అల్లాగేం?

హే—ఎంతమాత్రం కలగజేసుగోను. ఈక్షణంలో వాళ్ళిద్దరూ. రాత్రి భోజన వంటకాల గురించిన సంప్రతింపులో వంటింటో ఉంటారని నానమ్మకం.

ర—అల్లాయితే వాళ్ళ రహస్య సమావేశంలో నేనుకూడా పాల్గొంటాను. వంటలక్కని పిలవండి. మీ కేమీ కష్టంగా లేదనుకుంటాను, ముసలయ్యగారు!

హే—అబ్బెబ్బె ఎంతమాత్రం లేదు. కాని, ఎల్లాగా అని చూస్తున్నాను. వంటలక్క ఇల్లాంటి ప్రశ్నలువేస్తే మూగనోం పట్టేస్తుంది. ఇప్పుడుగనక మనం రమ్మని కబురంపామా, మనకందరికీ ఇంటోంచి ఉద్వాసన చెప్పేస్తుంది.

హృ—పోనీ, మీ స్టోరుకొట్టులో ఉండే తినుబండాల జాబితా చూపించండి, మీరు మామీద చాలా దయ ప్రసరించి నట్టవుతుంది. కడుపులోని ఆకలికీ కాగితం మీద పడే ఖర్చుకీ ఉర్జీ కుదరేటట్టు నేను చూస్తూంటాను.

హే—(ఇద్దరికేసీ చూసి ఆశ్చర్యపడతాడు.)

ర—అవునండి. అతడు చెప్పిందే ఒప్పు. నా అలవాటూ అంతే.

హే—అయ్యా! మీరిక్కడ ఏమన్నా చెల్లుతుంది. ఒరేయి, ఎనడురా, ఈరాత్రి భోజనానికి ఖర్చుబిల్లు పట్రా. అది తయారుచేశారనుకుంటాను. ఏమంటాయి, హృదయనాథంగారు! మీధోరణి చూస్తే నాకు మూసహాసు మేజర్లు

వల్లప్ప జ్ఞాపకం వస్తున్నాడు. అతడు ఎప్పుడూ ఏమనే వాడా,—భోజనం నోట్లోపడాలి, అప్పుడు భోంచేశాం అని నమ్మాలి—అనేవాడు.

హ్యా—(తనలో) అదుగో అప్పుడే అంతరిక్షంలో ఊరేగుతున్నాడు! మామ మేజరుట మహా! ఇక తనతల్లి జడ్జీఅని కోసేస్తాడు గావును. (పైకి) అయ్యా, నాకు శాకాహారం తప్ప పనికిరాదు.

ర—నాకు మాంసాహారం తప్ప పనికిరాదు. ఆట్టే అక్కర్లేదు. రెండో మూడో కూరలు శుచిగానూ సనిగానూ ఉంటేచాలు.

హే—అయ్యా! తయారుచేసింది ఏదీకూడా మీకు నచ్చదేమో! మీఇష్టం ఏమేమిటో చెప్పండి, తత్ప్రకారం చెయిస్తాను.

ర—సరే, పోనీ, మీఇష్టం ఏదైతే అదే పంపండి. ఇక పక్కలు—అవెల్లా ఉన్నాయో!

హే—అవి సరిగ్గానే ఉంటాయి. నే చూస్తానుగా. మీరు కదలక్కర్లేదు.

ర—అబ్బే! మీరు చూడ్డం ఏమిటి? అల్లా అంటే నేను సుతరామూ ఒప్పను. క్షమించాలి. అది నేను స్వయంగా చూసుగోడం అలవాటు.

హే—నా మాటనమ్మండి. మీకు నచ్చేపక్క నేను ఏర్పాటు చెయిస్తాను.

ర—వల్లకాదండీ. నేనే చూడాలని నేను నిశ్చయం చేసుకున్నాను. (తనలో) ఒహోహో, చాలా పేచీరకం మనిషిలాఉన్నాడే, ఎక్కడా చూళ్లేదూ!

హే—అయితే నడవండి పక్కలు చూద్దురుగాని. మీతో నేనుకూడా ఉండాలని నేను నిశ్చయం చేసుకున్నాను. (తనలో) ఇదే ఇప్పటి నాగరికత అయిఉండవచ్చును గాని, వెనకటి పోగరుబోతుతనానికి దీనంత దగ్గిరిగా ఎదీ ఉండదు. (పైకి) రండి. (అని LM కి నడుస్తాడు.)

ర—(LM కి హేమగిరి వెనకాలే వెడతాడు,)

హృ—ఈ ఆసామీ కనపరిచే మర్యాదలన్నీ బాధాకరం అయిపోతున్నాయే! (అని LF కేసి చూసి) అరే! ఎవరదీ? రంజనిలాఉందే! ఏమిఅదృష్టం!

[LF నించి రంజని వస్తుంది]

రం—హృదయనాథా! ఏమిటీ అదృష్టం, ఏమిటీ కాకతాళీయం? ఎల్లాపడింది ఈ సమావేశం?

హృ—నీకంటె ముందు నేనే అడగవలిసిన ప్రశ్న నన్నడిగావు. నా ప్రేయసి రంజనిని కలుసుకుంటా ననుకుంటానా ఈ హోటల్లో?

రం—హోటలేమిటి? తప్పకుండా అదేదో పొరపాటు! మాఅత్త, నాకు సంరక్షణ చేసేఆవిడ, బసే ఇదీ! ఇది హోటలు అనుకోమని మిమ్మల్ని ఎవరు మభ్యపెట్టారూ?

హ్యా—నా స్నేహితుడు రత్నమణీ, నేనూ ఇద్దరం వస్తూంటే ఇది మంచి హోటలు అని సలహాయిచ్చి ఇక్కడికి పంపించాడు ఓలబ్బాయి మాకు అకాత్తుగా ఈప్రాంతాన్నే కనబడి.

రం—అదా! అయితే మా మేనత్తకొడుకు టక్కరితనమే ఇది! వాడు మరీ పాడుఘటంకాడు. నే చాలాసార్లు చెప్పలేదూ నీతో, అతడే. (అని నవ్వుతుంది).

హ్యా—ఏమిటీ? మీ అత్త నిన్ను కట్టబెడతా నంటోందే, వాడే! నా భయమంతాకూడా ఎవడిమూలానో్న వాడే!

రం—నామాటనమ్ము. అత డంటే భయపడవలిసిన అవసరం ఏమీలేదు. వాడు నన్ను ఎంత అసహ్యించుగుంటాడో నీకు తెలిస్తే, వాణ్ణి ఆరాధన చేస్తావు. ఆమాట మా అత్తకీ తెలుసు. అందుకనే తను మొదలెట్టింది, నన్ను ప్రేమించడం! పైగా, ఆవిషయంలో విజయం తనదే అనుకుంటోంది.

హ్యా—అమ్మ మాయధారీ! విను, రంజనీ! మా స్నేహితుడు వస్తూంటే, ఇంట్లో ప్రవేశించవచ్చుగదా అని తరుణం పోగొట్టుకోకుండా వచ్చేశాను. వచ్చేసరికి గుర్రాలు అలిసిపోయాయి. కాని, త్వరలోనే తేరుకుంటాయి. రంజనికి హృదయనాథంలో విశ్వాసం ఉంటే, ఈ ప్రాంతందాటి అవతల పడచ్చు.

రం—నీమాట శిరసావహిస్తాను. ఇదివరకు బోలెడు సార్లు నీతో అన్నానే! నా సొమ్ము వదిలేసుగుని రావడం నాకు మనస్కరించడంలేదు. మా మామ నాకిచ్చిందే, అందులో చాలాభాగం. అవన్నీ నగలూ రాళ్ళూనూ, అవి ఓమాటు ఒంటిమీద పెట్టుగుని చూస్తానని మా అత్తని చేలేస్తున్నాను. నేను నెగ్గేటట్టే తోస్తోంది. అవి నా స్వాధీనంలోకి రావడమేమిటి, అవీ నేనూ నీస్వాధీనం కావడమేమిటి!

హ్యా—నగలూ లేదు గిగలూ లేదు పోదూ! నీమూర్తే నేకోరేది. నువ్వు నాకు దక్కేలోపల మాస్నేహితుడు రత్నమణికి ఈ భవనం గురించిన పొరపాటు తెలిసిపోకూడదు. అతడు మహా ముభావంమనిషి. అఘాయిత్తుగా ఈ భవనం హోటలుకాని సంగతి అతడికి తెలిసిందా, నునపాచిక పారకుండానే, అతడు కాలికి బుద్ధిచెప్పేస్తాడు.

రం—ఎల్లా అతణ్ణి దగాచేస్తూ ఇంకా ఉంచడం? వినయప్రభ షికార్నించి ఇప్పుడే ఇంటికొచ్చింది. పోనీ, అతణ్ణి ఇంకా దగాలోనే ఉంచుదాం. ఆలోచించుదాం. ఇల్లా రా...(అని R F కి తీసికెడుతుంది).

[రత్నమణి LM నించి వస్తాడు]

ర—ఈ హోటలుయజమాని పట్టింపు మరీ దుర్భరంగాఉంది. నన్ను ఒంటరిగా ఉంచడం మర్యాదా లక్షణం కాదుట, అందుకని నన్ను జీడీలాగ పట్టుగున్నాడు, వద

లదు. అతడి ముసిలి పెళ్ళామూ అతడూ నామీద భైటా యించారా అన్నట్టున్నారు. వాళ్ళు నాతో పంక్తినికూచుని భోజనంకూడా చేస్తారట!

[R F నించి ముందు హృదయనాథం,
వెనకాల రంజనీ వస్తారు]

ర—ఇదేమిటి?

హృ—ప్రియమిత్రమా, రత్నమణీ! నిన్ను అభినందిస్తున్నాను. మహాదృష్టం కాక తాళీయంగా కొట్టుగొచ్చింది. ఇక్కడికిప్పుడు ఎవరు వచ్చారని, నీ ఊహ?

ర—నేను ఊహించుగోలేను.

హృ—మన ప్రియులు, వచ్చారోయ్—వినయప్రభా, రంజనీనూ! ఇదుగో రంజనిని నీకు పరిచయం చేస్తున్నాను. ఈ పక్కనే ఏదో విందుకి వచ్చారట వీరు, గుర్రాల్ని శిరాయించుగోడానికి ఇక్కడ ఆగారు. వినయప్రభ అల్లా ఆ గదిలోకి వెళ్ళింది, నిమిషంలో వస్తుంది. ఇది గొప్ప అదృష్టంకాదూ? ఏం?

ర—(దిగాలుపడి తనలో) ఈ ముసిలాడి ధోరణికి తట్టుగోడానికే మృత్యువంత పనిజరుగుతూంటే, నా దురవస్థ పూర్తిచెయ్యడానికి ఇంకా ఏదో వచ్చి పడేటట్టు తోస్తోంది.

హృ—ఏమంటావ్, రత్నమణీ! భూమిమీద ఇంత అదృష్టం ఎవరికేనా పడుతుందా?

ర—నిజమే నిజమే, అవును. గొప్ప అదృష్టం—చాలా ఆప్యాయంగల ఎదుర్కోలు—కాని, మన దుస్తులు చాలా ఖరాబుగా ఉన్నాయి కాదుటోయ్, హృదయ నాథం! పోనీ, ఈ సౌఖ్యాల్ని రేపటికి వాయిదా వేస్తే బాగుంటుందేమో! రేపు—మనింటిదగ్గిర—అక్కడ, వీలుకి వీలూ ఘరానాకి ఘరానాకుడానూ—అవును, సమావేశాలు రేపు...(అని, వెళ్ళబోతాడు.)

హృ—రేపా, ఎంతమాత్రం వల్లకాదు, ఇప్పుడే! నీ పట్టింపుచూస్తే వినయప్రభకి కష్టంగా ఉంటుందిస్మీ. ఏమిటో దుస్తులు దుస్తులంటావేమిటీ? దుస్తులు ఖరాబుగా ఉన్నాసరే, నువ్వు సమావేశంలో పాల్గొన్నావా, నీప్రేమ మరీ సాంద్రంఅనీ నువ్వు నీమనస్సు ఉండబట్టలేక పోయావనీ విదితం అవుతుంది. ఈ భవనంలో నువ్వు ఉన్నట్టు ఆవి జెరుగును. నీకు దర్శనమూ ఇస్తుంది.

ర—అయ్యబాబో! నేనెల్లా ఇదవడం! (ముక్కి, డగ్గి) హృదయనాథం, నువ్వు వెళ్ళకూడదుస్మీ. నువ్వుండి నాకు సాయంచెయ్యాలి, తెలిసిందా? లేకపోతే నేను కంగారులో పడి నవ్వులపాలౌతాను. అయితేంలే, దీని శిఖాగొయ్యా, సాహసిస్తాను. (అని సకిలిస్తాడు.)

హృ—హోహోయ్! ఏట్లో దూకేవరకే, తరవాత చలీ గిలీ ఎగిరి చక్కాపోతాయి. ఇంతాచేసి ఆవ్యక్తి స్త్రీ కదా!

ర—అవునులే. అయితేం? స్త్రీజాతిలోకల్లా ఏరకం వ్యక్తిని ఎదుర్కోడం నాకు పాడలో ఆరకం మరి.

[షికారు వెళ్ళి వస్తూన్నట్టు, వినయప్రభ వస్తుంది]

హ్యా—(పరిచయం చేస్తూ) రత్నమణీ! ఈవిడే వినయప్రభ. మీలాంటి ఇద్దరి ప్రజ్ఞావంతుల్ని సమావేశ పర్చగలిగినందుకు నేను గర్విస్తున్నాను. మీరు ఒకర్ని ఒకరు ఎరుగుండడం ప్రారంభించగానే రెండోవార్ని గౌర వించడమూ ప్రారంభిస్తారు.

వి—(తనలో) సరి. ఈ మొహమాటపు నాగరికుణ్ణి పలకరించాలి. అప్పుడే మొహం వెళ్ళబెట్టాను. విన్నమాట నిజమే. (కాస్త ఆగి, ఇంతలో అతడికి ఒంటిమీద తేళ్ళూ జెర్రులూ పాకినట్టుకాగా) అమ్మా! తమరు క్షేమంగా వచ్చినందుకు, చాలా సంతోషం. వచ్చేదాన్లో ఏవోకొన్ని అవాంతరాలు గడిచారని విన్నాను.

ర—అబ్బే, కొంచెం అండి. అంటే, అవునవును, కొన్ని వచ్చాయండి. నిజమేనమ్మా, కాస్తంత విడివిగానే వచ్చాయి. పైగా, చాలా బాధగానూ ఉన్నాయి, కాని, ఆ చిక్కులవల్ల సంతోషమూ కలిగింది—అంటేనండీ, చివరికి అన్నీ సుఖంగా పరిణమించాయండి.

హ్యా—(రత్నమణితో) భేష్. నీజన్మ అంతలోనూ కూడా ఇంతకంటె బాగా మాట్లాడలేదు నువ్వు. కాస్సేపు ఈ స్థాయి నిలబెట్టు, విజయం నీకు రూఢి.

వి—అయ్యా, తమరు మరీ మెచ్చుగుంటూ సెల విస్తున్నారు. మీరు నగరాల్లో చాలా నాజూకు సమావేశాల్లో పాల్గొన్నవారు, ఈ మారుమూల ప్రాంతంలో మీకు ఎల్లా ఊసుపోతుందో కాని!

ర—(చాలా ధైర్యం చిక్కబట్టి) నేనండీ, నగరాల్లో కాదండి, ప్రపంచంలో పెరిగినవాణ్ణండి. కానైతే, సభఅంటే నాకు సయించదండి. ప్రపంచానుభవం అన్యులకి వదిలేసి, సాక్షిలాగ ప్రపంచాన్ని వీక్షించడంలో ఉండిపోయానండి.

వి—మరి కావలిసిం దేమిటండీ! ఆనందమార్గం, చివరికి, అదే—అని, విన్నానండి.

హృ—(రత్నమణితో) ఓరి సీ తస్సలమందూా, ఎంత బాగామాట్లాడావు! ఏ మహావక్తాయిడా ఇల్లా మాట్లాడలేడు. మరొక్కసారి ఇట్లానే పేల్చావా, కోటలో పాగా వేశావన్నమాటే.

ర—(హృదయనాధంతో) అయితే, (గుటకేసి) నా పక్కనే...(ఆగి) నుంచో, ఎప్పుడేనా నేను ఒరిగి పోయేటట్టు కనబడితే, ఒకటి రెండు మాటలు బోలెట్టి నన్ను నిలబెట్టు.

వి—జీవితంకేసి చూస్తూ కూచునేవాళ్ళకి ఎక్కువ తిట్టవలిసిన అవసరమే వస్తుందండి, దీవించడంకంటె. అందుచేత, మీరు సాక్షిలా ఉండిపోయి గమనిస్తూ కూచోడం భావ్యంగా ఉన్నట్టు తోచదునాకు.

ర—క్షమించాలండి, మీరు. నాకు మునుపొద్దులా సరదా ఉండాలి. అందుకని ఇతరుల ప్రమాదాలు నాకు తమాషాగా ఉంటాయే కాని, బాధాకరంగా ఉండవు.

హృ—(రత్నమణితో) బలే, బలే. దంచిపారేశావు. పుట్టింతరవాత ఇంత జోరుగా ఎన్నడూ నువ్వు మాట్లాడ లేదు. సరేనండి, వినయప్రభగారూ, మీరూ రత్నమణి గారూ చాలా సరసంగా సంభాషించుకోగలరని తేలింది. మీ సమావేశానికి మేం ఆటంకం ఏమో కదా అని భయం వేస్తోంది.

ర—ఎంతమాత్రం కాదండి, హృదయనాథంగారు! అన్నింటికంటె మీరుంటేకాని మాకు వీల్లేదు. (అతనితో రహస్యంగా) ఏముటోయ్, జీలకర్ర కబుర్లూ? పోతాట్ట! నన్ను ఎల్లా వదిలిపెడతావేమిటి?

హృ—మేం ఉంటే మీ సంభాషణ పాడవుతుంది. మేం ఈ పక్కగదిలోకి వెడతాం. (రత్నమణితో రహస్యంగా) ఏముటోయ్, నువ్వనేదీ? నీ యిష్టాగోష్ఠి నడపడం మేమా, నువ్వా?

(హృదయనాథమూ రంజనీ R F కి పోతారు)

వి—(కొంచెం ఆగి) మీరు కేవల సాక్షిమాత్రు లుగా ఉండిపోలేదని భావిస్తానండి. యువతులు మీ హెచ్చరికలవల్ల లాభం పొంది ఉంటారనుకుంటాను.

ర—(పిరికివాలకంలోపడి) క్షమించాలండి. నేను — నేను — (గుటకవేసి) నేను — ఇంకా — వాళ్ళకి — ఇదేదీ —

అర్థాణ్ణో - కానో - అనే, సం (గుటకవేస్తూ) గతి, గమ నిస్తూనే ఉన్నానండి.

వి—వాళ్ళని లభ్యపరుచుగోడానికి అది మిక్కిలి పాడుమార్గం — అని, కొంద రంటారండి.

ర—కావునండి, అమ్మాయిగారు. కాని, నా మక్కువ ఏమిటంటే, వాళ్ళల్లో వీలైనంత గాంభీర్యమూ జ్ఞానమూ గలవాళ్ళతోటే భాషించాలనండి. బహుశా, మీకు చాలా విసు గెత్తుతోం దేమోనండి!

వి—విసుగా, నాకా, కించిత్తూ లేదండి. అసలు గంభీర సంభాషణ అంటే నాకే బోలె డిష్టం. అది ఎల్ల కాలమూకుడా వినాలని నాకు ఉంటుంది. బలీయమైన చిత్త వృత్తిగల మానవుడు, తేలికగా ఉంటూ హృదయంగమం కానటువంటి రిత్త వినోదాలుచూసి ఎల్లా మెచ్చుకోగలడో, నిజంగా, ఆశ్చర్య మవుతుంది, ఆలోచిస్తే.

ర—అదండీ - ఒక - ఒక - తెగులండి - మనస్సు దండి - మనస్సది. రుచులు వేరు వేరు గనకండి - కొందరికి అభిరుచిలో - లోటూ - (అని గుటకేసి, సకిలించి, దగ్గు తాడు).

వి—అదాండీ! తెలిసింది, తెలిసింది. కొందరికి అభి రుచిలో లోటుండి, కోమల వినోదాల్ని రుచిచూడడం వాళ్ళకి చేతకాక, వాటిని తమరు ద్వేషిస్తూన్నట్టు నటన చేస్తారు.

ర—నే అనుకున్నది అదేనండి, అమ్మాయి, కాని మీరు దాన్ని అత్యంత రమణీయంగా అనేశారు. మరో విషయం. నేను మానేసెయ్యకుండా చెప్పదలిచి...ఇఇ యాయా......

వి—(తనలో) అప్పుడప్పుడు ఇతడు పెంకిగా ఉంటా డని ఎవ డనుకుంటాడూ !

—(పైకి) అయ్యో ! మీరు చెప్పదలిచింది, ఏమి టండి ?

ర—నేను చెప్పదలిచిందాండీ – సరండీ, ఒట్టండి. నేను ఏం చెప్పదలిచానో, మరి – మరిచి పోయానండి.

వి—(తనలో) నేనూ ఒట్టే ! నాపనీ అల్లానేఉంది.

—(పైకి) మీరు చెప్పదలిచిందాండీ, అవు నవును. ఇది కలికాలం కదండీ. అంతా మోసం, దగా, ద్రోహం గనక దీన్నిగురించే ఏదో మీరు చెప్పదలిచారు.

ర—అవు నండి. లుచ్ఛాతనానికి ఇవి రోజులు గన కండి, దట్టమైన ఆచోకీగనక పెడితే, ఒఖ్ఖడుకుడా...... ఆఆఆఆ......

వి—నాకు తమర నేది పూర్తిగా అవగాహన్నైందండి.

ర—(తనలో) ఓరి దేవుడా ! అదేమిటో నాకే అవగాహన కాలేదే !

వి—మీరు అనదలిచింది ఏమి టంటేనండి: లుచ్ఛా తనానికి ఇవి రోజులుగనక, దట్టమైన ఆచోకీ గనక పెడితే, ఒఖ్ఖడుకుడా – తన్ను నలుగుర్లోనూ ఏది తెగేసి ఖండిస్తాం

టాడో అదే రహస్యంగా ఆచరించనివాడున్నూ, తను ఏదేనా సౌశీల్యాన్ని మెచ్చుగోడం మాత్రం చేత దాని ఋణం యీవవస్తూ ఆ దెబ్బతో తీరిపోయిందని అనుకోని వాడున్నూ, ఉండడు, అని తేల్తుంది — అని.

ర—నిజమేనండి. కొందరికి సుగుణం నోళ్ళల్లో ఎంత మహత్తమంగా ఉంటుందో, హృదయాలలో అంత అల్పత మంగా ఉంటుంది. పాపం, నిశ్చయంగా, మిమ్మల్ని విసిగిస్తున్నానండి.

వి—అబ్బెబ్బే, విసుగేమిటండోయ్, సెబాసు. మీ ధోరణిలో ఏదో మనోహరత్వమూ ఏదో ఉత్తేజకత్వమూ ఉన్నాయి. ఆ వేవం, ఆ జవం! — అబ్బబ్బ, దయచేసి మరి కొంచెం మాట్లాడండి.

ర—చిత్తమండి. నేననేది ఏమిటంటే, కొన్నికొన్ని సందర్భాలలో — ధైర్యలోపం...ఇదేదీ ఇదేదీ ... దాన్ని సుబ్బరంగా నాశనం చేసి, మరికొన్ని...ఇదేదీ...స్థితిలోకి...

వి—నేను మీతో పూర్తిగా ఏకీభవిస్తాను. కొన్ని కొన్ని సందర్భాలలో ధైర్యలోపం అజ్ఞానవేషంలో కనిపిస్తుంది. కనిపించి, మనం మరీ మించిపోదల్చి నప్పుడు బలే స్వామిద్రోహం చేసేస్తుంది.

ర—మరేనండి, అమ్మాయి. నైతికదృష్ట్యా, అంతేనండి. ...కాని, అవతలగదిలో, రంజనీదేవి మనం వస్తాం

అనుకుంటూ ఉంటుంది. భూమి యావత్తూ నాకు రాసి ఇచ్చినాసరే, నేను మరొకరికి అడ్డం వెళ్ళేవాణ్ణి కాను.

వి—అల్లాంటే నేను ఒప్పనండీ. నాజన్మలో ఇంత మనోహరంగా కాలక్షేపం నాకు కాలేదండి. దయచేసి ఇంకా మాట్లాడండి.

ర—సరేనండి. కానండీ, నేనండీ,...అదుగోనండీ. ఆ అమ్మాయి రమ్మని సంజ్ఞ చేస్తోంది. మీతోకూడా నడవడం అనే గౌరవం నేనే నాకు ఇచ్చుగుంటాను.

వి—చిత్తం. ఇప్పుడే వస్తాలెండి. మీరు వెళ్ళండి.

ర—కొంతవరకు మృదువుగానే ఉందిగాని సంభాషణ, నన్నుమాత్రం మట్టంచేసేసింది.

(అని, RF కి నిష్క్రమిస్తాడు).

వి—(తనలో) ఔరా! (అని, ముక్కుమీద వేలేసుగుని నవ్వుతూ) సెబాసు! ఉసూరుమనిపించే ఇంత కొయ్యపాకపు సమావేశం ఎక్కడా ఉండదు. అతడు అంతసేపు ఇక్కడ కూర్చున్నా తలెత్తి, నా మొహంకేసేనా చూడలేదు. ఎల్లాపట్టుగుందో ఇతణ్ణి వల్లమాలిన సిగ్గు పట్టుగుంది కాని, మళ్ళీ, మనిషి బాగానేఉన్నాడు. పాపం, తెలివి గలవాడే కాని, భయం అతణ్ణి చుట్టబెట్టేసింది. తెలివిహీనుడి శోభకంటె ఇల్లాంటివాడిదే ఎక్కువ. ఇతడికి కాస్త ధైర్యం వచ్చేట్టు చెయ్యడమే కర్తవ్యం. (అని RF కే వెళ్ళిపోతుంది.)

[L F నించి లకుముకీ రంజనీ వస్తారు]

ల—నన్ను ఎందుకూ ఇల్లా వెంటాడిస్తావు, రంజనీ ? శృతి మీరుతున్నావు, సిగ్గులేదు నీకూ ? నా కాశ్చర్యం వేస్తోంది కుడానూ !

రం—ఎవరేనా వాళ్ళ స్వంత బంధువులతో మాట్టాడు కోడంగుడా నేరమేనా? యేమిటి, లకుముకి బావా !

ల—ఆ. నాకు తెలుసులేస్తూ, నువ్వు నన్ను ఎల్లాంటి బంధువుణ్ణిగా చెయ్యదల్చుకున్నావోనూ ! అపప్పు ఉడకదు, చెబుతున్నా, విను, రంజనీ, అల్లాంటిపప్పు ఇక్కడ ఉడకదు. నిన్ను ప్రార్థించేదేమనంటే, మనిద్దరికీ గల అంతరం గుర్తించి మరీ వర్తించు. ఆ దూరం అల్లాఉండనీ. అంతకంటె మనం చేరువుగా ఉండాలని నాకులేదు.

[రంజని లకుముకిని ప్రేమిస్తూన్నట్టు నటిస్తుంది. ఓర చూపు చూసి, నృత్తం వాలకంలో నడుస్తూ, మెటిగిలు కణతలదగ్గిర పేరుస్తూ, గాలి ముద్దెట్టుగుంటూ, వాణ్ణి సమీపించి, చెయ్యి పట్టుగోబోతుంది. వాడు ఒసిలి తప్పించుగుని, L B కేసి పారిపోతాడు. వాణ్ణి తరుముకుని రంజని వెడుతుంది. పై చేష్టలన్నీ గమనిస్తూ L F నించివచ్చి హృదయ నాథమూ కంతాలమ్మా ప్రవేశిస్తారు.]

కం—దయచెయ్యండి, హృదయనాథంగారు, మీ సంభాషణ చాలా వినోదకరంగా ఉంది. పట్నంకబుర్లు చెబుతూంటే నాకు అన్నమూ నీళ్ళూ అక్కర్లేదు. నాబొంది పల్లె

టూరిలో ఉన్నా నాప్రాణాలన్నీ పట్నంమీదే ఉంటాయి. పైకి నేను ఎల్లాఉన్నానో గాని, నామనస్సు నాజూకు తనాన్నే ఉపాసిస్తుంది. కాని, ఎన్నడూ చూడలేదు నేను పట్నం.

హ్రూ—ఎన్నడూ ? పరమాశ్చర్యంగా ఉందే! మీ రీతీ మీ వాలకమూ చూస్తే పట్టంలో పుట్టిపెరిగినట్టున్నారు, మరి.

కం—మీకు దయగనక అల్లాఅన్నారు. నాజోటి మొహాలకి పట్టంగుడానా! పత్రికలవల్లా, చిత్రాలవల్లా, ఉత్తరాలవల్లా, స్నేహితులవల్లా సంగతులు గ్రహిస్తాం టాను. నావేషం ఎల్లా ఉందంటారు ?

హ్రూ—ఓ తరవాయి లేకుండాఉంది. ఈ వేషంతో గనక మీరు పట్నంవస్తే, పట్నం పట్నం యావత్తూ మిమ్మల్ని చూడడానికి విరగబడి పోతుంపోడుం, అవుతారు.

కం—ఏమైతేం ? నాపక్కని మా ఆయన కూచునే సరికి, ఇంత వేషమూ కుక్క ముట్టుగు చక్కాపోతుంది. ఏమనుకున్నారో గాని! తన వేషంసంగతి పీడాపోయిరి, పోనీ, ఆ దిక్కుమాలి జనపనార సవరం మానమంటే ఆయన మానడే! పోనీ, బట్టతలగాఉండే ప్రాంతాల్లో ఏదేనా 'పొగడరు' కొట్టమంటే కొట్టడే! పైగా, ఆ పాడుసవరం తనికొద్దని నేనంటే, అది నేను పెట్టుగోడం నిమిత్తం అదో ఎత్తు, అంటాడు.

హృ—ఏడిసినట్లేఉంది. మీాయిష్టం! మీా వయస్సులో ఏదినచ్చితే అదే ధరిస్తారు, ఏది ధరించినా మీాకు తగే ఉంటుంది.

కం—అయితే, హృదయనాథా! పట్నంలో ఈమధ్య నాజూకు వయస్సు అంటే ఎన్నేళ్ళూ?

హృ—వెనక నలభై ఏళ్ళు. అయితేం, ఈమధ్య, అది యాభై ఏళ్ళుగా మారిస్తే బాగుంటుందని మహిళామండలివాళ్ళు మహాందోళన చేస్తున్నారు.

కం—యాభైయా? అయితే, ప్రస్తుత నాజూకు వయస్సు ప్రమాణాన్ని బట్టిచూస్తే, నేను చిన్నపిల్లగా గమనింపబడతానే!

హృ—మీారు చిన్నపిల్ల ఎందుకుకారండీ!...నగలు-నగలుమాట! నలభై దాటితేగాని పట్నంలో నగలు ధరించడానికే ఒప్పరు. ఇప్పు డెవరోపిల్ల — (L B కేసి చూపిస్తూ) అల్లా వెళ్ళిందేం, ఆపిల్లని, నాజూకు వర్గాలలో, పసిపిల్లలాగ పరిగణిస్తారు.

కం—మాతండే, మాతండే! అటువంటప్పుడు, మా మేనగోడలు దేవి, సగ లెట్టుగుంటానో అని నాలిక తెంపుగుంటుంది, ఎందుకూ, మహా యాభై ఏళ్ళ నాజూకు మనిషిలాగా!

హృ—ఆ పిల్ల మీా మేనగోడలాండి! అల్లాగా! మరొక ఘరానా ఆయనకూడా ఉన్నారు, ఆవిడతో, మీా తమ్ముళ్లాండీ?

కం—అబ్బే, నా పుత్రు డండి. వాళ్ళిద్దరి పెళ్ళికీ తాంబూలాలు పుచ్చుగోడం అయింది. వాళ్ళ చిట్టెళ్ళుంగారాలు చూశారుగదా! ఇదివరకే భార్యాభర్త లైనట్టు, రోజుకి అధమం పదిసార్లేనా కాట్లాడుకుంటూ ఉంటారు. (చప్పట్లుకొట్టి) ఒరేయ్, లకుముకీ, కన్నతండ్రీ, ఇల్లారా! ఏమిటీ మెత్త మెత్తని మాటలు మహా చెబుతున్నావు, ఈవేళా, రంజని వదెనతో!

ల—మెత్తని మాటలు మరేమీ చెప్పటంలేదు. సైతాన్ లాగ నన్ను పట్టుగోడం నాకు చాలా కష్టంగా ఉందని చెబుతున్నాను. నే నెక్కడికి వెడితే అక్కడే వెంట తరుముతోంది నన్ను. నేను విడిగా కూచోవాలంటే, నాకు పశువులశాల ఒక్కటే కనబడుతోంది.

కం—వాడిమాటలు లెఖ్ఖచెయ్యకు, వెర్రితల్లి! వాడు నిన్ను వెన్నంటే ఉంటాడుగాని, మరో అంతస్థులో ఉంటాడు.

రం—అవును. బావధోరణిలో గుప్తంగా ఉండే ఉదార లక్షణం ఏదోఉంది. నలుగురి ఎదటా నన్నుచూసి ఖస్సుమంటూండడం ఎందుకో తెలుసా, ఏకాంతంలో నన్ను బతిమాలుకోడానికి నెపంకోసం.

ల—ఛీ. అది మతిలేని దిక్కుమాలి అబద్ధం.

కం—అవు నవును. మావాడు బలేటక్కరి. ఏమండీ, హృదయనాథం! వీళ్ళిద్దరూ ఒఖ్ఖమచ్చుగా లేరూ? చూడండి

ఆమూతీ ఈమూతీనూ! అయ్యో అయ్యో! ఎంత ఈడూ జోడో చూశారూ! ఏమర్రోయ్, చిట్టివాళ్ళూ! ఇటోరూ అటోరూ తిర్గి దగ్గరసా నుంచోండి, హృదయనాథం తాత గారు చూస్తారూ! రారా లకుముకీ!

ల—(రంజని సరసని నుంచుని, తలతో రంజనిని కొడుతూ) నువ్వు నన్ను ఒప్పుగోకు, చెబుతున్నాను.

రం—బాబో, బుర్ర బద్దలు కొట్టేశాడు.

కం—ఓరి, రాక్షసికుంకా! సిగ్గుమాలిన భడవా! మనిషివికావుట్రా? మర్యాదలేదుట్రా నీదగ్గిరా?

ల—మనిషినైతే, నాఆస్తి నాకిచ్చెయ్. దేముడా! ఇక్కణ్ణించి మరి నేను టోపీపడను.

కం—బోలెడు డబ్బు నీయెదాన్నిపోసి, నీకు చదువు చెప్పించి శ్రమపడ్డందుకు ఫలితం ఇదిట్రా, కృతఘ్నుడా! నిన్ను ఉయ్యాల్లోవేసి ఊచినదాన్ని, మంచి చమ్చాతో ఆ బంగారుమూతికి బువ్వ అందించినదాన్ని, కానుట్రా? నీకు నాజూకుతనం రావాలని ఆ పొట్టికోటు నేనే కాదుట్రా కుట్టింది? రోజూ నీచేత మందులు తాగించి, అవి జీర్ణం అయేదాకా, నేను ఏడుస్తూ కూచోడంలేదూ?

ల—పోహెయ్, దేవుడికన్న! ఇంకా ఏడుస్తూ కూచో. నా పుట్టుకనించీ రోజూ నాకు ఏదో మోతాదు ఇస్తూనేఉన్నావు. వైద్యనిఘంటువులో ఉండేమందులు సరే సరి, లేనివికూడా నా గొంతికలో పోశావు. ఏడుస్తూండు. మరి నీ ఆటసాగదు, మరి దగాపడను.

కం—అదంతా నీ మంచికోసమే కాదుట్రా, పాము కానా! నీ మంచికోసం కాదూ?

ల—నన్నూ నామంచినీ వదిలెయ్. నా హుషారీ అంతా అణగ్గొట్టేస్తున్నావ్, ఎక్కడ దొరికావో! నాకు మంచి ఏదేనా ప్రాప్తుండుంటే, దాన్నేరానీ, నువ్వు తప్పుగో. చెవుల్లో ఊరికే రణగొణధ్వని మానెయ్!

కం—వెధవఅబద్ధాలాడకు. నువ్వు హుషారీగా ఒఖ్ఖ మాటేనా లేవు. అల్లాయితే, పోరా, నీ సారాదుకాణానికి, పో. నీ మోటువాగుడికి సంతోషమూ నా మొహమూ! పోపో రాతిగుండె రాక్షసీ!

ల—ఓరి దేవుడునోరు! అమ్మా, నీవాగుడే ఎక్కువ మోటు!

కం—ఇల్లా విన్నారాండీ, ఎక్కడేనా? వీడికోరిక నేను గుండెపగిలి చచ్చిపోవాలనీ! నిజమే, నాకు తెలుసు.

హృ—అమ్మా యువతీమణీ! మీరు వెళ్ళండి. ఈ సుకుమారుణ్ణి నాకు వొదిలిపెట్టండి. ఇతడికి నేను ఉపన్యసించి బోధించి ఇతడిధర్మం ఇతడు ఆచరించేటట్టు నచ్చచెబుతాను.

కం—చిత్తం. నేను వెళ్ళితీరాలి. రా, రంజనీ, పోదాం. చూశారా, హృదయనాథంగారు, ఎంత నీచమూ అసహ్యమూ అయిందో నాస్థితి!

—ప్రాణపదంగా చూడబడుతూ చక్కగా ఉంటూ ముద్దొస్తూ కోపం తెప్పిస్తూ విధ్యుక్తధర్మం ఎరక్కుండా ఉంటూన్న తన కొడుకుచేత—ఎవర్తేనా తల్లి క్షోభపడిందా నాలాగ ! (అని L F కి పోతుంది.)

రం—(కంతాలమ్మ వెనకాలే L F కి వెడుతుంది.)

ల—ఉన్నాడు యువకుడు

పుట్టింది బుద్ధీ
ఎక్కాడు గుర్రం
తీశాడు ధౌడు
వాడిఖుషీ వాడిదే
వాడిమాట వాడిదే
వాడి బాట వాడిదే
కాదంటే గాడిదే.

ఆవిణ్ణి లెఖ్ఖచెయ్యకండీ. ఏడవనీండి. ఆవిడ ఏడిస్తేనే ఆవిడ హృదయానికి చలవ.

హృ—ఆడవాళ్ళంటే మీకు ఇష్టం లేనట్టుందే, అబ్బాయి గారు !

ల—సరిగ్గా ఇష్టం రానట్టుంటారుగనక.

హృ—మీఅమ్మ ఇష్టపడుతూన్న ఆ పిల్లమీదకూడా మీకు కన్ను లేదనుకుంటాను. నాకళ్ళకి ఆపిల్ల చక్కగా సమతత్వం గల చిన్నదిలాగ కనపడుతోందే ?

ల—అల్లాగా ! నేనెరుగున్నంత దోస్తీగా ఆపిల్లని మీరెరగరుగనక. ఆ అమ్మాయి పుట్టుపూర్వోత్తరా లన్నీ

నాకు తెలుసు. దానికంటె విషసర్పమూ దానికంటె కయ్యాల గంపా ఉండడం, కష్టం.

హ్యా—వరించేవాడికి ఈమాటలు చాలా ప్రోత్సాహకరం!

ల—నేనాపిల్లని ఇంతప్పణ్ణించి ఎరుగుదును. బోనులో పడ్డ ఎలక్కి ఉండేజత్తులూ, మొదటి స్వారినాడు గుర్రాని కుండే లయలూ' దాని దగ్గిరున్నాయి.

హ్యా—నామనస్సుకి ఆపిల్ల బుద్ధీ శాంతమూ గలిగి ఉన్నట్టు తోస్తుందిమరి.

ల—ఆం. ఆ టక్కులన్నీ నలుగురూ చూసేటప్పుడు! కాని, తోటివాళ్ళతో ఆటలాడే టప్పుడు చూడండి దాని మజాకా, బురదలో దిగబడ్డ పందిలాగ తెగ కోలాహలం చేసేస్తుంది.

హ్యా—ఏమో! ఆపిల్ల వాలకంలో వినయంతో కూడిన మొహమాటం ఉంది, — అది నన్ను మంత్రించి పారేస్తోంది.

ల—కాని, కాస్తంత కళ్ళెం బిగించిచూడండి, ఆ పళంగా ఒఖ్ఖటే కాపుతన్నుతుంది, దాంతో మీరు సైడు కాలవలో ఈతకొట్టాలి.

హ్యా—నిజమే కావచ్చుగాని, కొంత అందం ఆ పిల్ల దగ్గిర ఉన్నసంగతి ఒప్పుగోవాలి, మరీ! కాదూ! కొంచెం అందమేనా ఒప్పుగుతీరాలి.

ల—అందమా, నాబొంద! అది యావత్తూ తయారీలోవచ్చిన అందమయ్యా, వెఱ్ఱివాడా! దేవుడుతోడు, ఆకళ్ళున్నాయ్యా, రాక్షసిబొగ్గు కళ్ళు పెద్దదెయ్యాల్లాగ! దవడలు ఎఱ్ఱగా విశాలంగా సోఫాదిండ్లులా ఉన్నాయి. ఒక్కొక్కదవడే రెండవుతుంది.

హ్యా—సరే. ఈ విషవృక్షం నీకు తప్పిపోయేటట్టు చెయ్యగల స్నేహితుడుంటే!

ల—అంటే?

హ్యా—నిన్నూ నీసౌఖ్యాన్నీ నీకు వదిలేసి, రంజనిని చేపట్టేవాడుంటే, వాణ్ణి మెచ్చుతావా?

ల—ఆ. కాని, అల్లాంటివాడెక్కడుంటాడూ, దాన్నెవడు కోరతాడూ?

హ్యా—నేను. నాకు నువ్వు సాయంచేస్తే, ఆపిల్లని ఒఖ్ఖదెబ్బని పరదేశం తోలేస్తాను. దాని ఊసు నువ్వు మళ్ళీ వినవు.

ల—సాయమా! నా రక్తంతుడా ధారపోస్తాను, చక్కనా అట్టేపెట్టుగోకుండా! రెప్పపాటులో ఎగరేసుకుపోయే రెండుగుఱ్ఱాలబండీ కట్టిస్తాను. వీలైతే, మీరు కల్లో

కూడా అనుకోని పని మరోటి చేస్తాను—ఆపిల్ల నగలన్నీకూడా పట్టుగొస్తాను.

హృ—ఓయి నారాజా, నువ్వు చాలా సాహసంతో కూడిన యువకుడవయ్యా!

ల—చూద్దురుగాని, రండి మరి మీరు వెళ్ళిపోయే లోపల, నాసాహసం ఇంకా ఎంతఉందో!

(నాయ్ ననానాన......అంటూ RM కి పోతాడు, హృదయనాథం అతడి వెనకాలే వెడతాడు)

(తెర)

## రంగం-3

[ఏసామానూలేని ఒక గది. LM నించి హేమగిరి నిమ్మళంగా నడుచుగుంటూ వస్తాడు]

హే—(తనలో) అబ్బెబ్బే! బొత్తిగాను! పట్నం మొత్తానికి తనవాడంత మొగమాటస్థుడు ఉండడంటూ నా పూర్వస్నేహితుడు, పెదరాజు, ఉత్తరం రాశాడుగదా, అతడు ఏమన్న పెద్దమనిషీ! అల్లా రాయడంలో అతడి ఉద్దేశం ఏమిటీ? ఈ కుర్రాడు నా ప్రాణానికి శుద్ధ నిర్మోహ మాటపు పెంకిఘటంలాగా, మాటలు నేర్చిన లోహపు సరుకులాగా, తోస్తున్నాడు. నాపడకకుర్చీలో తను పడు కున్నాడు, వెచ్చగా! ఇష్టాగోష్ఠిగదిలో చెప్పులు విడిచి పైగా శాస్తి, వాటిని జాగర్తగా కాపలాకాస్తూ నన్ను కూచోమన్నాడు. వీడిపొగరుతో మా అమ్మాయి ఏమి తల్ల కిందులు అయిందో వినాలి. — వినయప్రభకి, నిజంగా, గర్భనిర్భేదం అయిపోయి ఉంటుంది.

వి—(LF నించి చాలా సాదా వేషంలో వస్తుంది)

హే—అమ్మా, వినయా! నేను కోరిన చొప్పున, నువ్విప్పుడే వేషం మార్చేశావే! మార్చవలిసొచ్చినంత నిర్బంధం ఏదీ లేదనుకుంటాను.

వి—మీ ఆజ్ఞప్రకారం చెయ్యడం నాకు ఆనందం నాన్నగారూ! ఎంత ఆనందమనగా, ఆ ఆజ్ఞ ఉచితమా అనుచితమా అని తర్కించకుండానే దాన్ని ఆచరణలో పెట్టేస్తాను.

హే—అటువంటి నీకు వినయా, నేనే అవాంతరాలు తెచ్చి పెడుతున్నాను. చాలా మొహమాటపు వరుడు ఇతణ్ణి చూడు—అని, ఈ అబ్బాయిని ఈవేళ నీకు సిఫార్సు చెయ్యడం ఎంత అవాంతరం ?

వి—ఇతడు ఒక అసాధారణవ్యక్తి—అని మీరు నాకు ముందే వర్ణించి బోధించారు. కాని, అసలు మనిషిని చూసేసరికి మీవర్ణన చప్పబడిపోయింది.

హే—నాకు ఇంత ఆశ్చర్యం జీవితంలో ఎన్నడూ కలగలేదు. అతడి ప్రవర్తనతో నా ప్రజ్ఞలన్నీ నశించి పోయినాయి!

వి—నాకు ఆమోస్తరుగా ఏమీ కనిపించలేదు. ఆయనకి లోకానుభవమూ ఉంది!

హే—దేశం తిరిగాడు కాడుటన్నా, మరీ, అప్పుడు నేర్చాడు! నే నెంత వెర్రిలో పడ్డానోచూడు. దేశాలుతిరిగే యువకుడికి మొహమాటం అబ్బుతుందా! రమ్మంది. వేష ప్రదర్శనంలో మాటచమత్కారం నేర్చా నన్నట్టుంది.

వి—నేర్చినట్టుకూడా లేదు, అంతా సహజంగానే ఉంది.

హే—నీ కేం తెలుసూ! దుష్టసాంగత్యమూ, షోకేళా నాట్యాచారి తరిఫీయతూ!

వి—మీరు పొరబడుతున్నారు, నాన్నా! నేర్పడానికి షోకేళా నాట్యాచారి ఉంటే అటువంటి బెదురుచూపూ, వెర్రివాలకమూ, మొహమాటపు వైఖరీ నేర్పుతాడా?

హే—ఎవరిచూపు సంగతీ నువ్వనేదీ, ఎవరివైఖరీ?

వి—ఆయనదే, రత్నమణిగారి వైఖరే! ఆయనగారి భిడియమూ పిరికితనమూ, మొట్టమొదట చూడగానే, మరీ కొట్టొచ్చినట్టు కనిపించాయి.

హే—అల్లాఅయితే, నీమొదటిచూపు నిన్ను దగా చేసింది, నా జ్ఞానేంద్రియాలన్నీ బేజారెత్తిపోయినాయి,—ఆ నిర్మొహమాటపు ఘటాన్ని నేను మొదట చూడగానే!

వి—నిజంగా, మీరు తిట్టాలని తిట్టేస్తున్నారు, నాన్నా! అంత మొహమాటస్థుణ్ణి నేనెక్కడా చూడలేదు.

హే—నవ్వులాటమాని విను, అమ్మాయి, అంత ఎగిరిపాటూ అంత తిప్పుగోడమూ గల కట్టుపొగరుబోతుని నేను పుట్టింతరవాత చూడలేదు.

వి—చాలా చిత్రంగాఉందండీ! నేను వెళ్ళగానే మర్యాదగా తలతో వందనంచేసి, వంచినతల మళ్ళీ ఎత్తకుండా నేలకేసే దృష్టిపెట్టి, నట్టుతూనట్టుతూ మాట్లాడారు.

హే—సరి, నేను కనపడగానే, ఊరంత గొంతి గెట్టుగుని, రాచబింకంతో మాట్లాడాడు. ఆతడి అతి పరిచయం చూస్తే నాఒళ్ళు కంగ్రబారిపోయింది.

వి—నా యెదట హడిలి గడగడలాడిపోతూ ఎంతో మర్యాదగా ఉన్నారు. ఈ కాలంలోని ఆచారవ్యవహారాలు విమర్శించారు. నవ్వంటే ఎరగని ఆడపిల్లల గడుసుదనం మెచ్చారు. నేను తమర్ని విసిగిస్తున్నానేమో అంటూ క్షమాపణలతో నన్ను విసిగించేశారు. వెళ్ళేటప్పుడు, "ఏమండోయ్, భూమియావత్తూ నాకు రాసిచ్చినాసరే, నేను, మరొకరికి అడ్డం వెళ్ళేవాణ్ణి కాను" అంటూ చక్కగా మొక్కుతూ నిష్క్రమించారు.

హే—బాగానేఉంది. తన జీవితమంతా నన్ను ఎరుగున్నట్టు నాతో ప్రసంగించాడు. ప్రశ్నమీద ప్రశ్న చొప్పున పాతిగేసివేస్తూ ఒక్కదానికేనా సమాధానం విని పించుగోలేదు, చెప్పనియ్యలేదు. గొప్పగొప్ప అభిప్రాయాలు నేను చెబుతూంటే ఏదో కొంటిముక్క పట్టుగొచ్చి శ్లేష స్తూండేవాడు. చివరికి ఏమైందనుకున్నావు, నేను ఒకటో రకమైన వీరగాథ ప్రత్యక్షం అయేటట్టు చెబుతూంటే, నీకు పంచరసం తయారుచెయ్యడం బాగా రాదాఅని అడి గాడు. నిజమే, వినయప్రభా, మీనాన్నని ఆ ఆసామీ పంచరసం తయారుచేసే వాడివేనా అని అడిగేశాడు.

వి—మనిద్దరిలో ఎవరో ఒకరం పొరపాటుపడి ఉండాలి.

హే—ఏమో! అతడి చేష్టలులాగే అతడి మన స్సుంటే, నువ్వతణ్ణి పెళ్ళాడ్డానికి నేను ఒప్పను.

వి——నాకు కనపడ్డంత సభాపిరికి ఘటం అతడు నిజంగా అయిఉంటే, అతణ్ణి పెళ్ళాడ్డానికి నేను ఒప్పను.

హే——అయితే, ఒకవిషయంలో మనకి పేచీలేదు—ఎందులో? అతణ్ణి తిరస్కరించడంలో.

వి——కాని, అందుకూ ఆటంకాలు ఉన్నాయికాదండీ! మీరనుకునేకంటె తక్కువ పెంకిరకమై నేననుకునేకంటె ఎక్కువ గ్రహింపుగలవాడై—మీరనుకునేకంటె ఎక్కువ మర్యాద నేర్చినవాడై నేననుకునేకంటె ఎక్కువకోరిక గలవాడై, ఉంటే, ఏమో, ఆదారివేరు! రూపరేఖలు బాగానే ఉన్నాయి మనిషికి. లక్షమందిలో ఇల్లాంటివాళ్ళు ఆట్టే ఉండరు.

హే——పోదూ! అల్లాఉంటేకదా! వాడు మనిద్దరమూ కోరుకుంటూన్న లాంటివాడు కావడం అసంభవం. మొదటి సమావేశంతోటే నేను పని పూర్తిచేసుకున్నాను. ప్రథమంలో నేను దగాపడడం అంటూ సాధారణంగా ఉండదు.

వి——అయినా ప్రథమ సమావేశంలో స్ఫుటం కాకుండా కప్పడిపోయిన సల్లక్షణాలు ఉండవచ్చు కాదండీ, నాన్నగారూ!

హే——ఓహోహో! అదా నువ్వనేదీ? ఇల్లానే ఉంటుంది. వరుడియొక్క బాహ్యరూపం తనకి నచ్చడంతోటే, ఏ వధువైనాసరే వాడి అంతరంగ సామగ్రి ఏమై

ఉండునా అని అంచనాలు మొదలెడుతుంది. వాడికి నున్నటి ముఖం ఉండడంచూసి, మంచి బుద్ధి ఉందనుకుంటుంది. షోకైన వేషం ఉండడం గమనించి, ప్రతీ సుగుణమూ ఉందను కుంటుంది.

వి—పోనీలెండి, నాన్నగారూ! నాకేనో కొంత గ్రహింపుశక్తి ఉందని నన్ను అభినందిస్తూ ప్రసంగం ప్రారంభించారుగదా, నాకు అవగాహనే లేదని మాతి విరిచేస్తారా చివరకి?

హే—మరోహలా యెంచకు, వినయా! ఈ యువకశ్రీ నిర్మోహమాటీగారు విరుద్ధాల్ని సమన్వయించ గల నేర్పరిగనక అయిఉంటే, మని ఉభయులకీ గుడా నచ్చుతాడేమో, బహుశా.

వి—పోనీ, నాన్నా, మనిద్దరిలో ఎవరో ఒకరం తప్పు దారిలో ఉన్నాంగనక, ఇంకా ఈ విషయం తరిచిచూస్తే!

హే—ఓ, భేషుగ్గా, కాని, నామాట నమ్మూ, నే నన్నదే ఒప్పు.

వి—కాని, నామాటనమ్మండి, నేనన్నదితప్పుకాదు.

హే—సరే. చూద్దాం. (అని LM కి వెళ్ళిపోతాడు.)

వి—(LM కి తండ్రి వెనకాలే వెళ్ళిపోతుంది.)

[RM నించి ఒక చిన్న నగలపెట్టి పట్టుగుని లకుముకి వస్తాడు]

ల—చచ్చిపోను! లాక్కొచ్చాన్నా బాబూ, ఈ పెట్టె! ఇందులోనే ఉన్నాయి రంజని హారాలూ, లోల

కులూ, మరి తక్కినవిన్నీ. వాళ్ళఆస్తి వాళ్ళకిచ్చెయ్యకుండా మా అమ్మ దగాచెయ్యడం నే ఒప్పుతానా ? (R F కేసి చూసి) ఓర్, ఆ అఖండుడే! రావయ్యా హృదయనాథం!

హృ—(R F నించి వస్తూ) ప్రియమిత్రమా ? మీ అమ్మగారికి టోపీ ఎల్లావేశావ్ ! నీకు రంజనిమీద మనస్సు ఉన్నట్టూ, మీ అమ్మ చెప్పినప్రకారం నువ్వు చేసేటట్టూ నటించావా ? మాంగుర్రాలు మరి కాస్సేపట్లో బడలికనించి తేరుకుంటాయి. వెంటనే మేం బయల్దేరవచ్చు.

ల—దార్లో మీకు ఖర్చుకీ దానికీ ఉపచరిస్తుంది, ఇదుగో (అని పెట్టెయిస్తూ) నీ ప్రేయసి నగలు పుచ్చుగో. దీల్లో ఒక్ఖటైనాసరే ఎవడేనా తస్కరిస్తే, వాణ్ణి ఉరిదీసి పైకిపంపు.

హృ—(పుచ్చుగుంటూ) ఔరా ! ఎల్లా తీసుగున్నావు మీ అమ్మదగ్గిర్నించీ ?

ల—పనిజరిగే సూక్ష్మపద్ధతిని వేలితో మీ టేసి సంపాదించాను. మా అమ్మకి ఎన్ని పెట్టెలున్నాయో వాటి సొరుగుల్లో ప్రతీదానికీ మారుతాళంచెవులు నాదగ్గిర లేకపోతే, ఇంత తరుచుగా నేను తాగుడుశాలకి ఎల్లా వెడుతున్నానుమరీ ! నిజాయితీమనిషి స్వంతసొమ్ము ప్రతీ అప్పుడూ తస్కరించుగోవచ్చు.

హృ—నిజమే. వేలకొలది జనం రోజూ అంతే చేస్తారు. కాని, నీదగ్గిర దాపరికం ఎందుకూ, రంజని ఇవి

మీ అమ్మదగ్గిర్నుంచి ఏదో లయవేసి లాగాలని చూస్తోంది. రంజని ఎత్తు నెగ్గితే తద్వారా ఇది నేం పుచ్చుగోడం ఇంతకంటె నాజూకుమార్గమేమో!

ల—అమార్గం ఏమవుతుందో తేలేవరకూ, ఇవి మీ దగ్గిర ఉంచండి. రంజని ఎత్తు ఏమవుతుందో నాకు దివ్యంగా తెలుసు. మా అమ్మ తన నోట్లో మిగిలిన ఒక్క దంతమూ ఊడ లాగినా ఊరుకుంటుంది గాని, ఇవిమాత్రం వదలదు.

హ్యా—కాని, ఇవి పోయినట్టు గ్రహించడంతోటే, మీఅమ్మకి కోపంవచ్చి ఏంజరుగుతుందో అని భయం వేస్తోంది.

ల—మా అమ్మ కోపంసంగతి మీకెందుకు పోదురూ! అది నేను చూసుగుంటానులెండి. ఆవిడ కోపాన్ని నేను గవ్వాగచ్చకాయా కిందకూడా కట్టను. ఓరి దేవుడు కాలా! వాళ్ళు వస్తున్నారు, (అని L F కేసి చూసి) ఈ వేపునించి, (R F కి సూచిస్తూ) మీరు ఇల్లా చెల్లాచెదరయిపోండి.

హ్యా—(R F కి గబగబా పరిగెడతాడు.)

[L F నించి కంఠాలమ్మా, రంజనీ వస్తారు]

కం—నిజమే, రంజనీ, ఆశ్చర్యం వేస్తోంది. నీలాంటి కన్నెపిల్లకి నగలేమిటే! అబ్బే! నీకు మరో ఇరవై ఏళ్ళు నెత్తిమీదికి వొచ్చింతరవాత, అప్పుడు, నీఅందం సికస్తుపడి పోతే దానికి శాస్త్ర బలం కలిగించాలిగనక నగలు కావాలి గాని, ఇప్పు డెందుకే, కూనా?

రం—నలభై ఏళ్ళ్యేట అందాన్ని మరమ్మతు చెయ్యగల దినుసు ఇరవయ్యేయేట అందాన్ని అభివృద్ధి చేసి తీరుతుంది, అత్తా!

కం—నీఅందాన్ని అభివృద్ధి చెయ్యడానికి ఏనగా పనికిరాదు, ఏమనుకున్నావోగాని! నీముఖంలో ఉన్న సహజ వికాసం వెయ్యి నగలపెట్టు కాదుటే వెర్రితల్లీ! పైగా, అమ్మాయోయ్, నగలు ఇప్పటికాలంలో మోటయాయి. ప్రతీనగకీ మోజైపోవడంతప్ప రెండోపనేలేదు. ఎరగువుటే, మొన్న మనం చూశాం, ఆ దివాంతకదేవీ, ఆ గూనేశ్వరీ వాళ్ళంతా పట్టం పరిగెట్టి నగలు పిరాయించేసి వాటికి బదిలీగా అడ్డమైన ఇమిటేషను చెత్తా పట్టుగొచ్చారుకార్టే!

రం—నిజమేగాని, అత్తా, నాకున్న కాసిని నగలూ నావంటిమీద ఉంటే, తెరచాటున ఉన్న ఏనరుడో ఇష్ట పడచ్చునేమో ఎవ రెరుగును?

కం—పోనీగాని, అమ్మాయి, ఓ పనిచెయ్. అద్దం ఎదటికివెళ్ళు. వెళ్ళిచూడు, నీకళ్ళతో—చారెడేసి ఉన్నాయి గనక—జిగజిగలాడేవి—మరేమన్నా నీకు లోటేమో! ఏంరా, కన్నతండ్రీ, లకుముకీ! నువ్వుచెప్పు. నీకళ్ళతోచూస్తే, రంజని వదినెకి, అందం పెంచడానికి నగలు అవసరమా?

ల—అది, తరవాత ఎల్లా ఉంటుందో, దాన్నిబట్టి ఉంటుంది.

రం—అత్తయ్యా! నీ కెంతో ఋణపడి ఉంటా నత్తయ్యా!

కం——నగలు నగలు అని నువ్వు అనుకుంటున్నావు. అవన్నీ దిమ్మచెక్కలూ బల్లపరుపులూనూ. పూర్తిగా సాన తీర్చి నగిషీ చెక్కింది ఒక్కటీ లేదు. అవిగాని, నువ్విప్పుడు ధరించావా, మూగనాటకంలో పురాణపాత్రలాగ తయారవుతావు. అదీకాక, వాటిని పట్టుగోడం కష్టం. ఈమధ్య వెతికిచూస్తే, కనిపించలేదు, ఎక్కడ పెట్టానో ఏముటో!

ల——(కంతాలమ్మతో రహస్యంగా) అల్లాయితే, ఆ అమ్మాయి వాటికోసం అంతగోల పెడుతోందిగనక, అవి పోయాయని నువ్వు ఆ అమ్మాయితో అనెయ్యకూడదూ? అవి పోయాయని చెప్పిచూడు. ఆపిల్లని ఊరుకోపెట్టడానికి మరోమార్గం లేదు. పోయాయను. అందుకు సాక్షి మా లకుముకే, అను.

కం——(లకుముకితో రహస్యంగా) ఓరి కన్నబిడ్డా, లకుముకీ! నేను నీకోసమేరా అవిదాస్తా! సరే, అవి పోయాయని నేను దాంతో చెబితే, అందుకు అనుగుణంగా నువ్వు సాక్ష్యం చెబుతానంటావ్? బాగుంది (అని హిహిహి అని నవ్వుతుంది).

ల——(కంతాలమ్మతో రహస్యంగా) ఏమీభయం లేదు. అరి దేవుడుకూలా! అవి తస్కరించి లాక్కుపోతూంటే నేను కళ్ళారా చూశానంటాను.

కం——ఒక్కరోజు నన్నవి పెట్టుగోనిస్తే చాలత్తా. స్మారక చిహ్నాలుగా చూపెట్టుగుంటాను, తీరిపోతుంది. తరవాత మళ్ళీ నువ్వు దాచి తాళం వేసుకుందుగాని.

కం—రహస్యం దాచడం ఎందుకు, రంజనీ! అవి కనిపిస్తేగదా, పోనీ అని నీ కియ్యడం! అవి పోయాయి, నమ్ము. నాకు తెలిసినంతవరకు, పోయాయి, మనకి బాఘా ఓపికఉండాలీ, అవి ఎక్కడుంటేం?

రం—అవి పోయాయని నేను నమ్మనత్తా! నాకవి ఇవ్వడాని కిష్టంలేక ఏదో సులువుగా నెపం లేవదీశావు. అంత విలవైనవి ఎక్కడేనా అంత అజాగ్రత్తగా పారేస్తారా ఏమిటి? ఒకవేళ పోయినా, పూచీ నీదేగనక......

కం—ఖంగారుపడకు, రంజనీ! అవి నిజంగా పోవడమే జరిగితే, వాటంత విలవ నీకు ముట్టచెప్పవలిసిందాన్ని నేను. అవి పోయినట్టూ, వెతిగినా కనపడనట్టూ, మాలకు ముకీ ఎరుగును.

ల—ఆవిషయం నేను సాక్ష్యం పలకగలను. అవి పోయాయి, వెతికినా కనబడలేదు—అని, సత్యప్రమాణిక్యం చెయ్యగలను.

కం—కొంత పరిత్యాగం నేర్చుగోవాలి, చిట్టితల్లీ, నేర్చుగోవ్వాలి. మన ఆస్తి యావత్తూ పోయినాసరే, మన ఓర్పుమాత్రం పోగొట్టుగోకూడదు. చూడు, నే నెంత శాంతంగా ఉన్నానో!

రం—ఆ, ఉండకేం? మరొకరి కర్మం కాలిపోతూన్నప్పుడు జనం సాధారణంగా ఎంత శాంతంగానేనా ఉంటారు.

కం—ఇంత తెలిసినదానివిగదా, నువ్వు రాళ్ళనీ రప్పల్నీ గురించి నీబుర్ర పాడుచేసుగోడం చూస్తే ఆశ్చర్యం వేస్తోంది. పోయినవి పోయినట్టు అల్లానే కూచుంటాయా యేమిటి? వెతికి పట్టుగుందాం. అవి కనిపించేలోపల, నువ్వు, ఇంచక్కా నూ, నా దానిమ్మరాళ్ళు...పెట్టుగో, పోనీ.

రం—దానిమ్మరాళ్ళ నగలంటే నాకు ఛీకు.

కం—అయ్యో, ఎరగవే పిచ్చిదానా! నీలాగ శరీరకాంతిగలవాళ్ళకి దానిమ్మరాళ్ళు ఉఱ్ఱి కుదిరినట్టు మరోరకం కుదరవు. నే పెట్టుగునే టప్పుడు అవి ఎంత అందంగా కనిపిస్తాంటాయో చూసిందానివేగా. అవి నీ కిస్తాలే. (అని L F కి వెళ్ళిపోతుంది.)

రం—అన్నింటిలోకీ అవంటేనే నాకు మంట. (లకుముకితో) నువ్వక్కడ ఆగు. ఇవతలవాళ్ళకి కాలుకొస్తుందా రాదా చెప్పు లకుముకీ! నా నగలు దాచేసి, తను ధరించే చెత్త నేను పెట్టుగోవాలని నన్ను బలవంతం చేస్తూన్నప్పుడు!

ల—మతి పోగొట్టుకోకు. ఆవిడ దానిమ్మరాళ్ళ నగలిస్తే, ఇచ్చినంతవరకు అవీ లాగెయ్. నీనగలు ఈవరకే నీవై పోయినాయి. ఆవిడ భీరువాలోంచి నేనవి తస్కరించేశాను. ఆ సంగతి ఈవిడ ఎరగదు. నీప్రియుడు దగ్గిరికి పరిగెట్టు. ఇంకా చాలా చెబుతాడాయన. ఈవిణ్ణి నాకు వదిలెయ్, నేను లొంగదీస్తాను.

రం——నీది ఎటువంటి హృదయమయ్యా, బావా!

ల——టట్, తక్షణం నువ్వు మాయమైపో. మా అమ్మ వచ్చేస్తోంది, బీరువా వెతిగిచూస్తే నగలు కనిపించక!

రం——(గబగబా R F కి పరిగెడుతుంది.)

ల——(L F కి చూస్తూ) ఆరి, దేవుడు శిఖాగొయ్యా! చెంద్రుకుంటూ బాణాసంచా చక్రంలాగ నిప్పులు కక్కుతూ ఎల్లా వస్తోందో, మా అమ్మదేవి!

కం——(L F నించి ఖంగారుగా వస్తూ) అయ్యో! దారుణం, మోసం! దొంగలు, దొంగలు! దగాచేశారు, దోచుకున్నారు, బద్దలుకొట్టేశారు, మట్టంచేసేశారు!

ల——ఏమిటి సంగతి? సంగతేమిటి, తల్లీ? మనింటో వాళ్ళకెవళ్ళకీ ఏమీ ప్రమాదం జరగలేదుకద!

కం——మనయిల్లు దోచారు, నాబీరువా బద్దలుకొట్టి, నగలు లాగేశారు. నాపని అయిపోయింది.

ల——బస్, ఇంతేనా! (అని నవ్వేసి) పైవాళ్ళ శాసనాలు చల్లగాఉండగా, ఇంత బాగా దొంగతనం జరిగిపోవడం నాజీవితంలో వినలేదు. దేవుడుతోడు, నిజంగా, నీఆస్తి ఏమన్నా తస్కరించారేమో, అనుకున్నాను. (అని, మళ్ళీ నవ్వుతాడు.)

కం——అదేమిట్రా, నిజంగానా అంటావేమిటీ? నిజంగానే, నేను నాశనం అయ్యాను. నాబీరువా పగలగొట్టి, అంతా అపహరించారు.

ల—ఆ మాటమీాద నిలబడు, (అని నవ్వి) ఆమాట మీాదే నిలబడు. నేను సాక్ష్యం, తెలిసిందా, నన్ను సాక్షిగా వేసుగో.

కం—వినిపించుగో, లకుముకీ! ఎంత కొట్టుబడితే అంతబట్టు! ఆనగలు పోయినాయి, నేను ఇక నాశనం కావలిసిందే.

ల—అవి పోయినట్టు నాకూ రూఢిగా తెలుసు. అంతేగా పలకవలిసిందీ!

కం—అయ్యో పెర్రిలకుముకి నాన్నా, వినరా. అవి పోయాయి—అని, చెబుతున్నానురా.

ల—చట్టాలతోడు, అమ్మా! నిన్నుచూస్తే నాకు నవ్వొస్తోంది. (అని, నవ్వి) అవి ఎవరు తస్కరించారో నాకు బాగా తెలుసు (అని, మళ్ళీ నవ్వుతాడు.)

కం—ఓరి! నీఅంత మట్టితెలకాయి ఎక్కడేనా ఉంటాడ్రా? నవ్వుతూ అన్నదానికి త్రికరణంగా చెప్పిం దానికీ తేడా గ్రహించుగోలేవే? ఓరి, కోతిగా, కోతిగ! నేను వేళాకోళంగా అనడంలేదురా!

ల—సరే, అయితేసరే. ఏడవడంమాని నువ్వు కొంచెం కలకల్లాడుతూ ఉంటే, జనం నిన్నూ నన్నూకూడా శంకించరు. పోయాయని నేను సాక్ష్యం ఇస్తాను.

కం—ఔర! నీఅంత అడ్డదిడ్డపు జంతువు ఎక్కడేనా ఎప్పుడేనా ఉండగలడురా, మాటే వినవాయిరి! మూర్ఖుడి కంటె నువ్వునయం అనికుడ: సాక్ష్యం ఇయ్యగలవా? ఏ దీను

రాలినైనా, నన్నులాగ, ఓవైపు మూర్ఖులూ మరోవైపు దొంగలూ ఇల్లా చుట్టబెట్టెయ్యడం ఉంటుందా ?

ల—అందుకూ ఇస్తాను, సాక్ష్యం !

కం—అందుకూ ఝళ్ళీ సాక్ష్యమే ! ఓరి చవట తల కుంకా ! నుంచున్న పాట్ను అవతలికి పంపించెయ్యగల్ను, జాగర్త. అయ్యో ! వెర్రి మేనగోడలా ! అది ఏమై పోతుందో, ఇది విని ! అయ్యో, నవ్వుతున్నావురా, రాతి గుండె రాకాసీ ! నాదుఖ్ఖం నీకు ఆనందముట్రా ?

ల—అందుకూ ఇస్తాను, సాక్ష్యం !

కం—నన్ను తూలనాడతావురా, పెనుభూతం ! తల్లి నిల్లా బాధించినందుకు, చేస్తానుండు నీకు మంగళం !

ల—అందుకూ ఇస్తాను, సాక్ష్యం ! (అని R F కి లకుముకి పరిగెత్తగా, కంతాలమ్మ అతణ్ణి వెంట తరుము తుంది.)

వి—(L B నించి వచ్చి, తనలో) ఔర ! మా సవి తన్నయ్య ఏమి అన్నయ్య ! ఈయిల్లు పాటలని వాళ్ళతో చెప్పినవాడు ఇత డేట ! ఇక, వరుడుగారు ! ఈ వేషంలో నేను ఇందాకా అల్లా వెడుతూంటే, నన్ను చూసి సారా అందిచ్చే పిల్లేమో అనుకుని వాకబుచేశార్ట ! అల్లానే, నేను నటించి, ఆయన్ని కలుసుగుని మాట్లాడతాను. గొంతిగ ఆనవాలు తెలియకుండా కీచుస్వరం రానిస్తాను. ఇందాకా కలుసుగున్న అంతసేపూ తన తలపైకే ఎత్తలేదుగనక

ఆయన నా మొహామే చూడలేదు. అందుకని నన్నిప్పుడు ఆయన పోల్చుగోలేడు, వస్తున్నాడు (R M కేసి చూసి) నేను దాక్కునివస్తాను. (అని L F కి వెడుతుంది.)

[R M నించి, తల వంచుగుని, చేతులు వెనకాల పట్టుగుని, ఆలోచన చేసుగుంటూ రత్నమణి వస్తాడు]

ర—(తనలో) అబ్బబ్బ! ఈ యింట్లో ప్రతీమూలా గోలే! క్షణమేనా నాకు విశ్రమించుదాం అంటే వీల్లే కొచ్చింది. మంచిగది ఏదేనా చూసుగుని కూచుందాం అంటే హోటలు యజమానీ, వాడికథా, తయారు! మెట్ల వరసమీాదికి లేచిపోదాం అంటే హోటలు యజమాను రాలూ నేలమీాద ఒలికిపోయే ఆవిడ మర్యాదలూ సిద్ధం. ఎల్లానో తప్పుగుని ఒఖ్ఖమాటు ఇల్లా రాగలిగాను. కాస్సేపు నాలో నేను ఆలోచించుగుంటాను బాబూ! (అని, ఇటూ అటూ పచారు చేస్తాడు.)

వి—(L F నించి ఒఖ్ఖ అడుగువచ్చి) పిల్చారాండీ, మీారూ! పిల్చారా ప్రభూ!

ర—(తనలో) అబ్బే! వినయప్రభ ఎక్కడ! మరీ గంభీరురాలు, మరీ గడ్డకట్టిన చిత్తవృత్తిమనిషి.

వి—పిల్చారా స్వామీ! (అని అతడి ఎదట పడ బోతుంది.)

ర—(చూడనట్టు తమాషాగా తప్పించుగుంటూనే నడుస్తూ)—లేదు, పిల్లా, పిలవలేదు. (మళ్ళీ తనలో) అదీ

కాక, ఒక్ఖమాటంటే ఒక్ఖమాటే అవిణ్ణి నేను దొంగపోటుగా చూశాను. ఆవిడికి మెల్లకన్నుంది.

వి—మరండీ, నాకు నిజంగా మీరు గంటకొట్టడం వినపడిందండీ!

ర—లేదులేదు. (తనలో) మా నాన్నని తృప్తి పరచడానికి, ఎల్లాగైతేం, ఇక్కడికివచ్చాను. మరినన్ను తృప్తిపరుచుగోడానికి, రేపు ఇంటిమొహం పడతాను. (అక్కడ ఉన్న కాగితాలు ఏవో చూసి చదువుకుంటూ ఉంటాడు.)

వి—బహుశా, మరొకాయన ఉన్నారే మీతో, ఆయన పిల్చారేమోనండి?

ర—లేదు. నామాట వినవేం?

వి—పిల్చారేమో, పోనీ, విని సంతోషిద్దాం, అని లెండి. సౌఖర్లం అంతమంది ఉన్నాం.

ర—లేదు లేదు, పి_ల_వ_లే_దు. (వినయ ముఖం పరకాయించి చూసి) అవును పిల్లోయ్! పిల్చి ననుకుంటాను. ఎందుకోసమా—ఎందుకోనమంటే—మరి, పిల్లా, నువ్వు చాలా అందంగా ఉన్నావుస్మీ!

వి—ఓయి దేవుడా, అదేమిటండీ, సిగ్గేసిపోతుంది కుడానూ!

ర—అబ్బ! నీకన్నులాగ మిలమిల లాడుతూ కుట్ర చేసే కన్ను నే చూడలేదు. అవునవును, పిల్లదానా, నిన్ను

పిల్చాను. మీయింట్లో అది—ఏమంటారు దాన్ని—అది ఉందా ?

వి—పదిరోజులాయె అయిపోయిందండి.

ర—ఈభవనానికి రావడం ఎందుకూ కొరగాదు, అని తేల్తోంది. పోనీ, ఒకవేళ, మచ్చుచూడ్డం నిమిత్తం, నేను నీ అధరామృతం చవిచూపించ వలిసిందని కోరతా ననుకో. ఆవిషయంలోనూ నాకు ఆశాభంగమే !

వి—అమృతమా, అమృతమాండి ! ఈప్రాంతాలలో అటువంటి ద్రావకం అడగరండీ ! అది ఏంకి భాషాండీ ? అల్లాంటి సారాయిలు ఇక్కడ నిలవచెయ్యరండి, ఏంకి దేశానివి గావునవి.

ర—అబ్బే, అది స్వదేశీపంటే, అబద్ధంకాదు.

వి—అయినా నాకు తెలియకపోడం ఆశ్చర్యమండీ ! మేం ఈభవనంలో అన్నిరకాల సారాయిలూ వుంచుతాం. ఇక్కడ నేను పద్దెనిమిదేళ్ళనించి ఉన్నానండి.

ర—పద్దెనిమిదేళ్ళనించా ? అబ్బో ! సారా అందిచ్చే పన్లో నువ్వు పుట్టడానికి పూర్వమే చేరినట్టున్నావు ! నీ కెన్నేళ్ళూ ?

వి—ప్రభూ ! వయస్సు చెప్పరాదండి. పెద్దలు అంతే కదండీ అన్నారు—ఆడదానివయస్సు చెప్పకూడదు, సంగీతం వయస్సు కట్టకూడదు.

ర—ఇక్కణ్ణించి చూస్తే నలభైకి అట్టే మించినట్టు లేవు. (సమీపించి) ఇంకా దగ్గిర్నించి అంతవయస్సూ గలట్టు లేవు. (ఇంకా సమీపించి) కొందరు స్త్రీలని బాగా

సమీపిస్తే వాళ్ళు మరీ చిన్నవయస్సు ఉన్నట్టు కనిపిస్తారు. కాని, చాలా చాలా దగ్గిరికొస్తే, నిజంగా...(అని, ముద్దెట్టుకో యత్నిస్తాడు).

వి—అయ్యా, దయచేసి, దూరం దూరంలా ఉండనియ్యండి. నా కేమనిపిస్తోందంటే, తమరు నావయస్సు కట్టడంలో—గుర్రాలకి నోరు తణిఖీచేసి వయస్సు కడతారే—అల్లా కట్టదల్చారేమో, అని.

ర—ఒప్పను, పిల్లా, ఒప్పను. నన్ను నువ్వు చిన్నచూపు చూస్తున్నావు. ఇంతదూరంలో నన్ను నువ్వు ఉంచేస్తే, నీకూ నాకూ పరిచయం కావడం ఎల్లా?

వి—ఎవర్తెకి కావాలయ్యా, మీతో పరిచయం? అఖ్ఖర్లేదు, నా కల్లాంటి పరిచయం అఖ్ఖర్లేదు. ఇప్పుడే ఇంతకుముందు ఇక్కడి కొచ్చిన వినయప్రభ సమక్షంలో మీరు ఎంత గత్తర బిత్తరగా వ్యవహరించారూ? నాకు ఘట్టిగా తెలుసు, ఆవిడఎదట మీరు పిడుగుపడ్డట్టు తల నేల దాకా వంచుగుని జడ్జీగారిఎదట ముద్దాయిలాగ కాస్త కాస్త చొప్పున గుటకలేస్తూ మాట్లాడారు.

ర—(తనలో) దేవుడా! దీనికి ఆసంగతి అంతా తెలిసింది, తప్పకుండా! (వినయతో) ఆవిడంటే నాకు భయం వేసింది పిల్లా! (అని, నవ్వి) ఆవిడ ఓ మెల్లకన్నుఘటం. అబ్బెబ్బే, నీతో ఎందుకూ, నన్ను నువ్వేరగవుగా! నేను నవ్వేసి, చిన్నరకం ముట్టడి ప్రారంభించాను. జోరుచెయ్య

డానికీ నామనస్సు ఒప్పలేదు. ఏమైతేం, నేను మరీ కగకుగా ఉండలేకపోయాను, ఇప్పుడేమనుకుంటే, ఏంకార్యం ?

వి—అల్లాయితే, స్త్రీప్రపంచానికి మీరు ఇష్టులను కుంటాను.

ర—అవును, పిల్లదానా! చాలా ఇష్టుణ్ణి. మళ్ళీ, నన్ను చంపుగున్నంతబట్టు, వాళ్ళు అదేధోరణిగా నావెంట పడడానికి నాలో ఏముందో నాకే తెలియను. స్త్రీల సంఘం వాళ్ళు నాకు 'గిలిగిచ్చ సింహుడు' అనే ముద్దుపేరు ఉంచారు. గిలిగిచ్చ సింహుడనేది నా అసలుపేరు కాదు, పిల్లా—నన్ను ఊరికే అల్లా వ్యవహరిస్తారు. నా అసలు పేరు సలామయ్య, సలామయ్యగారు! (అని సలాం చెయ్యబోతాడు).

వి—నన్ను మీ స్త్రీసంఘంవారికి పరిచయం చెయ్య దల్చుకున్నట్టున్నారుగాని, మీకు పరిచయం చేసుగు నేట్టు లేరు. మీరు ఆ సంఘస్త్రీలందరికీ ప్రియులా ?

ర—అవును, ప్రియా. అక్కడ బోలెడుమంది ఉన్నారు. మంత్రపతీసతి, కరికాలమ్మ, సిలుగురాణి, దీర్ఘశృంగి, జింకాజినదేవి, విధేయుడైన ఈ సవినయ సేవకుడు—మేమంతా ఆ సంఘానికి జీవం పోస్తున్నాం.

వి—అయితే ఆ సంఘ వాతావరణం చాలా కులాసాగా ఉంటుందన్నమాట!

ర—ఓ. పేక, భోజనం, సారా, వృద్ధస్త్రీలూ కలిస్తే ఉండే సుఖం అంతా అక్కడ ఉంది.

వి—అప్పుడు వారి ప్రియుడైన గిలిగిచ్చ సింహుడు ! (అని నవ్వుతుంది).

ర—(తన) దేవుడుతోడు, ఇల్లా నన్ను దెబ్బతియ్య డం నాకు కష్టంగాఉంది. ఇదికొంచెం పసికట్టినట్టుతోస్తుంది. (పైకి) నీకు నవ్వులాటగాఉందా, పిల్లా ?

వి—నాకు తల్చుగున్నకొద్దీ నవ్వు ఆగకుండా వస్తోం దండి. ఇల్లా మీతో ఉంటూంటే, వాళ్ళపన్లూ వాళ్ళ సంసా రాలూ చక్కదిద్దుకోడానికి వాళ్ళకి తీరిక ఎప్పుడూ, అని !

ర—(తనలో) ఫర్వాలేదు. అంతా బాగానేఉంది. నన్నుచూసికాదు, ఈపిల్ల నవ్వుతూంటా ! (ఆమెతో) నువ్వేదేనా పనిచేస్తూంటావా ఎప్పుడేనా ?

వి—అయ్యో, బోలెడు ! ఈ యింటో ఏ తెరా ఏ మడతకుట్టూ చూడండీ, అక్కడల్లా నేపనిచేసిన సాక్ష్యం దొరుకుతుంది.

ర—ఓరి దేవుడోయ్ ! అయితే నీ అంచుకుట్టుపని చూపించాలి. నేనూ అంచుకుడతాను, నమోనాలు గీస్తాను, కొంచెం. నీ కుట్టుపనితనం సరిగా నిర్ణయించాలంటే, నువ్వు నాకు దరఖాస్తు పెట్టుగోవాలి. (అని వినయ చెయ్యి పట్టు గుంటాడు).

వి—సరేలెండి. కాని, దీపం వెలుగులో రంగులు స్పష్టంగానూ అందంగానూ ఆనవు. ఉదయాన్ని చూడచ్చు లెండి. (అని, విడిపించుగోడనికి యత్నిస్తుంది).

ర—ఈక్షణమే ఎందుకు కూడదే, నా దేవదూతా! ఇలాంటి అందంవచ్చి మనిషిని ఎదురుకున్నప్పుడు ప్రతిఘటించడం మానవ శక్తికి అతీతం—(అని L F కేసి చూసి) ఛీ! ఆ దిక్కుమాలి ముసిలితండ్రి అడుగో! నా దురదృష్టం. పోనీ, కాస్త మంచిపట్టు పడిందని సంతోషిద్దాం అనుకుంటూంటే, దాని తరవాతే వరసాగ్గా ఒళ్ళు ఓకూలేని పాచికముక్కల పట్లు మూడు పడ్డట్టుగా ఉంది, నా ఆట! (అని, R F కి వెళ్ళిపోతాడు).

హే—(L F నించి వస్తూ) అయితే, అమ్మాయి! ఇతడా నీ మొహమాటపు వరుడు? నిన్ను సవినయంగా మెచ్చుతూ, ఉచితమైన దూరాన్నుంచే నిన్ను ఆరాధిస్తూ, తల ఎత్తకుండా దృష్టి నేలమీదే నిలుపుతూ ఉండేది ఇతడా? వినయా, వినయ! నీతండ్రిని ఇల్లా దగాచెయ్యడానికి నీకు మొహం ఎల్లా చెల్లిందీ?

వి—పోనీ మీరు నమ్మకండి, నాన్నా. అయినాసరే, నేను మొదట అనుకున్నట్టు ఆయన చాలా మొహమాటస్థుడు. ఆ విషయం మీకుకూడా దృఢనిశ్చయం కుదురుతుంది.

హే—ఒట్టేట్టి చెబుతానమ్మాయి, నా నమ్మకం, అతడి పొగరు వ్యాపించిపోతోంది. అతిగాడు నీచెయ్యి పట్టుగోడం నేను చూడలేదనా? గొల్లభామని కవ్వించినట్టు నిన్ను ఇటూ అటూ అతడు కవ్వించలేదా? ఏముటో, ఇప్పుడు నువ్వతని మర్యాదా అతని మొహమాటమూ అంటూ వెనకేసుగొస్తున్నావు, పోదూ!

వి—కాని, ఆయన మొహమాటస్థుడే అనీ, ఆయన ప్రమాదాలు కాలక్రమాన్ని అంతరించే బాపతువే అనీ, ఆయన సుగుణాలు వయస్సుతో పెంపొందగలవే అనీ, అతి స్వల్పకాలంలో నేను మీకు పూర్తిగా నచ్చజెప్పగలిగితే, మీరు ఆయన్ని క్షమిస్తారని ఆశిస్తాను.

హే—ఓహోహో! ఈ అమ్మాయి వాదనతో ఇవతలవాళ్ళకి మతిపోయేటట్టుంది. చెబుతా వినమ్మాయి. నా కింక పూర్తిగా నచ్చడం అంటూ, జరగదు. నాకు పూర్తిగా నచ్చిపోడంకాదు, నాటిపోయింది. వాడు ఈ యింటోకి వచ్చి మూడుగంటలకాలం అయిందో లేదో, అప్పుడే నా హక్కులు సర్వమూ లాగిపారేసి స్వంతం చేసేసుగున్నాడు. వాడిపొగరు చూసి నువ్విష్టపడి, దాన్నే మొహమాటం అని అంటే అను. కాని, అమ్మాయి, నాకు అల్లుడు అయేటంఉకు ఈ లక్షణాలకి భిన్నంగాఉండే ఇతర లక్షణాలుండాలి.

వి—నాన్నగారూ! ఈ రాత్రి వ్యవధి ఇయ్యండి, మీకు నచ్చచెబుతాను.

హే—వ్యవధి రాత్రంతానా? ఛీ! వాణ్ణి ఈ గంట లోనే బయటికి గెంటిపారెయ్యాలని ఆలోచన పుడుతోంది.

వి—పోనీ, గంట వ్యవధి ఇయ్యండి. మిమ్మల్ని తృప్తి పరుస్తాను.

హే—సరే. ఒక గంటకాలం ఇచ్చాను. కాని, ఇక నాన్న లెక్షేమిటి, అని చప్పరించకు. అంతా ధారాళంగా బహిరంగంగా ఉండాలి, విన్నావా ?

వి—సరే, నాన్నా ! మీరు నన్నెరగరా ? మీ ఆజ్ఞలు పాటించడం నాకు గర్వం. మీ అంతఃకరణ ఎటువంటిదనగా, ఎప్పుడూకుడా నా విధ్యుక్తధర్మం మీదికే నా మనస్సు వాల్తుంది.

హే—సరే సరే, నడు.

(వినయప్రభ L F కి నడవగా, వెనకాలే హేమగిరి ఆశ్చర్యంతో చూస్తూ వెడతాడు.)

## రంగం-4

[రెండో తెర ఎదట, R F నించి హృదయ
నాథం వస్తాడు]

హృ—(తనలో) రంజని కనపడి రత్నమణి తండ్రి పెదరాజుగారుకూడా ఇక్కడికే బయల్దేరారనీ, కాస్సేపట్లో రాసై ఉన్నారనీ చెప్పింది. నగలపెట్టె రత్నమణిదగ్గిర క్షేమంగా ఉంది. ఉడాయించడానికి ఏర్పాట్లు పూర్తి చెయ్యాలి. ఆ పిల్ల—జమీందారు రెండు గుర్రాల్నిస్తా నన్నాడు. బయల్దేరడం తోటకింది స్థలంనించే అని రంజనితో చెప్పడం మరిచాను. సరే, మళ్ళీ ఎక్కడో ఆవిడ తారసిల్లితే చెబుతాను. ఈ పక్కగదిలో రత్నమణి ఉంటాడు.

[అని L F కి నిష్క్రమించి, రెండో తెర లేవగా, L M నించి వస్తాడు. అక్కడ రెండుమూడు కుర్చీలూ బల్లా ఉంటాయి. ఒకదానిమీద రత్నమణి కూచుని ఉంటాడు.]

హృ—(వస్తూ) ఇదుగో రత్నమణీ!

ర—(ఉషారుగా, లేస్తూ) రావోయ్, హృదయ నాథ్, రా! నన్ను అభినందించు. నాకు కిరీటం పట్టా! చూస్తావేం? పూలదండల్లో నన్ను పాతరెయ్. నిజమే నోయ్! నాబోటిగాళ్ళం ఎంత మొహమాటం గలవాళ్ళం అయితేం, ఆడవాళ్ళ సందర్భంలో మాకూ విజయం లోటు రాదు.

హ్యా—ఒక్కొక్కరకం స్త్రీలలోనే అనా నీ అభిప్రాయం? ఘనత వహించిన తమ మొహామాటంగారు ఏమంత అఖండవిజయం సాధించారని, ఇప్పుడు తమరు మామీద ఇల్లా విరుచుకు పడిపోతున్నారూ?

ర—ఆఁ, నువ్వు చూడలేదూ, ఆ పిల్లనీ—అందర్నీ వెల్లిస్తూ చలాకీగా మనోహరంగా ఇంచక్కాగా నడుం పట్కాకి తాళంచెవుల గుత్తి గలగలలాడుతూ, చిమ్మెట లాగ తిరుగుతూండడమూ!

హ్యా—అవునవును. చూశాను. ఏంజరిగిందేమిటి?

ర—ఆపిల్ల నా స్వంతం! స్వంతం అంటే స్వంతమే! ఆ తళుకు ఆ జిగజిగ ఆ నేత్రాలు ఆ పెదవులు—కాని, దేవుడుతోడు, నేను ఎన్ని లయలువేసినా తన్ని నేను ముద్దెట్టుగోడానికి మాత్రం ఆపిల్ల ఒప్పలేదు.

హ్యా—అటువంటి పిల్లగురించి ఇంతగా నమ్ముతున్నావే!

ర—సఃదేహ మేమిటోయ్! తన అల్లిక కుట్టుపని ఒకటి మేడమీదికి తెచ్చి నాకు చూపించి, ఆ మాదిరి నాచేత ఒప్పిస్తానంది కూడానూ!

హ్యా—సరేగాని, రత్నమణీ! ఆపిల్ల గౌరవం తస్కరించడం అనేది ఎల్లా జరిపావు?

ర—గౌరవమా! జీలకర్ర, పోదూ! హోటల్లో మధురసం అందిచ్చేపిల్లకి గౌరవం మనం ఎరగంది కాదు.

ఏమైనా, తస్కరించడం కానే కాదు, నా యత్నం. నిజం చెబుతున్నాను.

హ్యా—ఆపిల్ల సుగుణవంతురాలు.

ర—అయితే, ఆ పిల్లని చెడతియ్యడానికి నేను ఆలోచనే చెయ్యను.

హ్యా—సరే. ఆ పెట్టె పంపించావే, అది జాగ్రత్త చేశావా? భద్రంగా ఉందా?

ర—ఓ ఓ. చాలా భద్రంగా ఉంది. దాన్ని గురించి చాలా జాగర్తపడ్డాను. కాని, హోటల్లో బసచేసే టప్పుడు ఏదో గదిలో తలుపుపక్క స్థలమా క్షేమమైందీ? అయ్యో, మూర్ఖత్వం! అందుకని, నీకంటె ఎక్కువగా నేను ముందు జాగర్తపడి... నేను...

హ్యా—ఏమిటి?

ర—నేను ఆ పెట్టె హోటలుయజమానురాలి కిచ్చి జాగర్త చెయించాను.

హ్యా—హోటలు యజమానురాలికే?

ర—(గర్వంగా) అవునోయ్, హోటలుయజమానురాలికి.

హ్యా—పంపించావా?

ర—ఓ. ఇందాకానే పంపించాను. తెమ్మనగానే ఇచ్చెయడం పూచీ ఆవిడిది.

హ్యా—అవును. సాక్షుల్తోసహా ఆవిడ తెచ్చి ఋస్తుంది!

ర—నేను మంచిపని చెయ్యలేదా ఏమిటోయ్? నేను చాలా తెలివితేటల్తో ఈ సందర్భంలో వ్యవహరించి నట్టు ఒప్పుగుంటావని నమ్ముతున్నాను.

హ్యా—(తనలో) నా ఆందోళన ఇతడు గ్రహించ కూడదు.

ర—నువ్వు మనస్సులో ఏదో కొంత ఆదుర్దా పడు తున్నావేమో అని తోస్తోందే? ప్రమాదం ఏదీ జరగలేదు కద?

హ్యా—అబ్బెబ్బే, ఏమీ లేదు. నాకు ఆదుర్దాకర్మం ఏమిటి? ఇప్పుడంత ఉత్సాహంగా ఉన్నాను. నువ్వు ఆ పెట్టె హోటలుయజమానురాలికి పంపిస్తే, ఆవిడ వెంటనే అది జాగర్త చేస్తానని అచ్చుగుంది గావును!

ర—అచ్చుగోడంలోనూ, ఇంకా అడిగీ అడక్కుండానే అచ్చుగుంది. ఆ పెట్టె జాగ్రత్తే కాదు,—ఆవిడ మరీ జాగర్త మనిషి కాదూ—ఆ పెట్టె పట్టిగెళ్ళిన మనిషి వాణ్ణి కూడా జాగర్త పెట్టేసింది. (అని నవ్వుతాడు).

హ్యా—(తనలో) సరి. అంతా చాలా తేలునంఅందూ!

ర—ఓ. పరమలోభియొక్క సంచీలో డబ్బులాగ!

హ్యా—(తనలో) ఇక్కడికి ఈ ఆస్తిగురించి నిరాశ చేసుగుని, నీళ్ళు వదులుకుని బయల్దేరాలి. (పైకి) సరే, రత్నమణీ! నీ అందాల పిల్లగురించి ఆలోచించుగుంటూ నువ్వు కూచో, నే పోతాను. (అని, నవ్వి) నావిషయంలో

జయం ఎంతగా సాధించావో, అంతగా నీనిషయంలోకూడా సాధించుగో. (అని R F నించి నిష్క్రమిస్తాడు)

[రత్నమణి, నవ్వుకుంటూ, ఓకుర్చీ R కేసి తిప్పి, దాన్లో కూచుని కాళ్ళుచాచి కళ్ళుమూసుగుని ఆలోచిస్తూ ఉంటాడు. L F నించి, హేమగిరి ఒక అడుగు వచ్చి, రత్న మణిని చూసి, ఆగుతాడు].

హే—(తనలో) నా యిల్లు నాకే పోలికకి అంద కుండా పోయింది. బుర్ర కిందికీ కాళ్లు పైకీ అన్నట్టొచ్చింది. వీడి నౌఖర్లంతా తెగతాగేశారు. ఇక నేను క్షణమేనా భరించలేను. కాని, వీళ్ళ నాన్నంటే నాకు ఎక్కడలేని గౌరవమూ ఉందిగనక, శాంతంగానే ఉంటాను. (రత్న మణితో) అయ్యా, స్వామీ! రత్నమణిగారూ! తమసేవ కుణ్ణి, తమకు విధేయుణ్ణి.

ర—అయ్యా! విధేయుణ్ణి. (తనలో) ఆశ్చర్యం ఏమి జరగడల్చిఉంద చెప్మా ఇప్పుడూ!

హే—అయ్యా! ఈ భవనంలో తమ తండ్రిగారి పుత్రుడికి మర్యాదలు జరిగినట్టు జీవించి ఉన్నవాళ్ళల్లో మరెవడికీ జరగవని తమరు గ్రహించారని, నేను నమ్ము తున్నాను. మీరూ అట్లానే అనుకుంటారని, ఆశిస్తున్నాను.

ర—త్రికరణంగా అనుకుంటున్నానండి. మళ్ళీ మళ్ళీ చెప్పించుగునేవాణ్ణి కాను, నేను. మాతండ్రిగారి పుత్రుడు ఎక్కడికి వెళ్ళినా వాడికి మర్యాద జరిగేటట్టే వ్యవహ రిస్తాను, సాధారణంగా.

హే—అల్లా చేస్తారని, నేనూ త్రికరణంగా నమ్ము తున్నాను. మీ ప్రవర్తనకి పోనీ, నే నేమీ అననుగాని, మీ నౌఖర్ల ప్రవర్తన మరీ దుర్భరంగా ఉంది. వాళ్లు తాగే తాగడం ధోరణిచూస్తే, ఇంట్లోవాళ్ళందరూ పాడు పడేట్టు న్నారండి, రూఢిగా.

ర—నేను ఒప్పనండి, ముసలయ్యగారు. ఆ విష యంలో నా తప్పు అసలులేదు. తాగవలిసినంతగా ఇంకా వాళ్ళు తాగడంలేదూ అంటే, వాళ్ళనే అనాలి! సారాయిల కొట్టులో ఒఖ్ఖ చుక్కైనా మిగల్చకుండా పీల్చెయ్యమన్నాను. నే చెప్పేశానండీ, రూఢిగానే! (L కేసి నడిచి, చెయ్యి విసురుతూ) ఏయ్! ఎవరోయ్, భంట్రోతులు! నా అనుజ్ఞ స్పష్టీకరించి చెబుతున్నాను. నేను తాగనుగనక ఆ లోటు మీరు కూడదియ్యండి.

హే—అయితే, వాళ్ళంతా తాగడంకుడా మీ అనుజ్ఞ చొప్పునేనా? అయితే సరే. నాకు తృప్తే.

ర—ఏం? మీకేమన్నా అనుమానం ఉందా, నేను ఆజ్ఞ ఇచ్చానో లేదోఅని? అయితే వాళ్ళనిపిల్చి ఆమాట వాళ్ళచేతే చెప్పిస్తాను.

హే—అఖ్ఖర్లేదు, ఆగండి, రత్నమణిగారు! కొన్ని గంటల్నించి మీ అల్లరిహాఠామీకి తలవంచి ఊరు కున్నాను. కాని, మీ పొగరుచేష్టలు అంతం అయేటట్టు

కనిపించడంలేదు. ఇక, ఇక్కడ నేను నా యాజమాన్యం స్థాపించ నిశ్చయించుకున్నాను. కాబట్టి, మీరూ మీ తాగుబోతుసజ్జూ తక్షణం నాయిల్లు విడిచిపెట్టి విరగడైపోవాలని కోరుతున్నాను.

ర—నీయిల్లా? విడిచిపెట్టాలా? చమత్కరిస్తున్నారా యేమిటి, నేస్తం? ఏదిచేస్తే నీకు చాలా సంతోషమో, ఆపనే చేసేటప్పుడా మమ్మల్ని వెళ్ళిపొమ్మనడం?

హే—తిన్నగా వినండి. మీరు నన్ను సంతోషపరచడంలేదు. అందువల్ల, తమరు నాఇంట్లోంచి లేచిపోవాలని కోరుతున్నాను.

ర—మీరు మనసారా చెబుతున్నా రనుకోను! రాత్రి ఇటువం టప్పుడా? అందులో ఇటువంటి రాత్రి! కొంచెం ఛలోక్తికోసం అంటునట్టున్నారు!

హే—ఇదుగో, చెప్పేస్తున్నాను. నేను మనసారా మాట్లాడుతున్నాను. నాకోపం అంటుకుంది. ఇది నా యిల్లండి, అయ్యా, నాయిల్లు. అందుకని, నిలబడ్డపాట్న, ఇది ఖాళీ చెయ్యండి, అని ఆజ్ఞాపిస్తున్నాను.

ర—అహ్హహ్హ (అని నవ్వి) ఆజ్ఞాపిస్తున్నారా? ఆజ్ఞాపించండి. తుఫానుగాలికి పొట్టెయ్య గొడుగువిప్పినట్టు! ఇంట్లో ఒక్కఅడుగేనా అవతలపెట్టను, రూఢిగా చెబుతున్నాను. ఇది నాయిల్లు. నేను ఎంతకాలం ఉండా లనుకుంటే, అంతకాలం నాయిల్లు. ఈయిల్లు విడిచిపెట్టి వెళ్ళ

లని ఆజ్ఞాపించేహక్కు మీా కెక్కడుందండీ ? ఇంత కట్టు పొగరుబోతుతనం, నా దుంపతెగా, నాజీవితంలో ఎరగనే ఇంతవరకు ?

హే—నేనూఎరగను, ఎరిగుంటే, నా మతిపోయి నంతఒట్టు ! నాయింటికి రావడమా, ఇష్టంవచ్చిందల్లా తే తెమ్మనడమా, నాకుర్చీలోంచి నాకు ఉద్వాసన చెప్పడమా, ఇంట్లోవాళ్ళని తూలనాడడమా, తన భంట్రోతుల్ని ముక్కు దాకా తాగమనడమా, ఇస్నీ కాగా చివరకి నా మొహం మీాద 'ఈయిల్లు నాదేనండి' అంటూ, కుండ బద్దలుకొట్టి నట్టు అనేసెయ్యడమూం ! ఆ పరమ పొగరుసాక్షిగా, నాకు నవ్వుకూడా వస్తోంది ! ఇహ్హిహ్హి ! (అని నవ్వి) అయ్యా ! దేవరా! ఈయిల్లు మీారు పుచ్చుగుంటూరు కాబోలు; ఇందులో సామగ్రికూడా మీారు దఖలుపరుచుగోడం గురించి ఏమాలో చించారు ? కొవ్వొత్తులు పెట్టుగునే వెండిగొట్టాలు రెం డున్నాయి, పొయ్యి తెరస్టాండుఉంది, ఇత్తడిముక్కల్తో కొలిమితిత్తు లున్నాయి—ఇల్లాంటివాటిమీాద మీాకు మక్కు వేమో, మరి.

ర—ఇయ్యవలిసిన లెఖ్ఖవేసి బిల్లుపట్రండి. చూస్తా రేం, పట్రండి బిల్లు. ఇక మనం మాటలు ఖర్చుచెయ్యవద్దు.

హే—అచ్చొత్తిన పటాలున్నాయి. మీాగదిలో ఉంచుకోడానికి నగిషీ చెక్కడా లున్నాయి. ఏమంటూరు ?

ర—బిల్లు పట్రండి అంటున్నాను. బిల్లు చెల్లించి వెంటనే ఈ నరకగృహం విడిచి బయట పడతాను.

హే—ఇంకా దేవుడు మేలుచేస్తే, నల్లమద్దితో చేసిన బల్లఉంది, అందులో మీ మొహం మీరు చూసుకో వచ్చు.

ర—బిల్లు తెమ్మంటున్నాను.

హే—అన్నట్టు, తమరు ఉదాత్తంగా భుజించిన తర వాత, ప్రత్యేకంగా కునుకులాగడానికి వీలైన పెద్దకుర్చీ మాట, మరిచిపోయానుస్మండి.

ర—హారి నీదేవుడుకాలా! నా బిల్లు తీసుగు రావయ్యా, నీ సోది కట్టెయ్యవయ్యా!

హే—ఓ అబ్బాయి! నువ్వు అబ్బాయివి. విను. మీ నాన్న నాకు రాసిన ఉత్తరాన్నిబట్టి, నాకు అతిథిగా వచ్చేవాడు ఆరిందాగా పెరిగి సిగ్గుభిడియాలుగలిగి ఉంటా డేమో అని ఆశించాను. కాని, ఆ వచ్చినవాడు లోకువ కనిపెట్టి ఎగిరిపడే షోకేళారాయుడుకంటె నయంకాదు, అని గ్రహిస్తున్నాను. మీ నాన్నే వస్తాడు కాస్సేపట్లో. వచ్చి ఇదీ ఇంకా జరిగేదీ వింటాడు. (అని L M కి వెళ్ళిపోతాడు)

ర—(తనలో) ఏమిటిచెప్మా! నేను ఈ యింటిని గురించి పొరపాటు పడలేదుకదా! ఎటుచూసినా హోటలు లాగనే ఉంది. భంట్రోతులూ అల్లాగే ఉన్నారు, వాళ్ళ వాలకమూ అల్లాగే ఏడిసినట్టుంది. తొంగుళ్ళందిచ్చే పిల్లకూడా ఉంది. (అని R F కి చూసి) ఇల్లా వస్తోంది. ఇంకా నాతో ఏమన్నా చెబుతుందేమో! ఏం పిల్లా, అంతజోరుగా పోతు న్నావు? ఇల్లారా, ఒక్కమాట చెప్పాలి!

వి—(R F నించి వస్తూ) త్వరగా తెమల్చండి, మరి. అవతల నాకు తొందరగా ఉంది. (తనలో) ఈయన తన పొరపాటు గ్రహించుకోడం ప్రారంభించినట్టున్నారు. యథార్థం ఇంత దబ్బున చెప్పెయ్యకూడదు.

ర—అయితే, పిల్లా, ఒక్క ప్రశ్న అడుగుతాను. దయచేసి సమాధానం చెప్పు. నీవృత్తి ఏమిటి? ఈఇంట్లో నీకు పనేమిటి?

వి—ఈ కుటుంబంవారికి బంధువునండి.

ర—అల్లాగా! పేదచుట్టానివా?

వి—మరేనండి, పేదచుట్టాన్ని. ఇంటి తాళంచెవులు నాచేతికే ఇస్తారండి. మీబోటి అతిథులు వచ్చినప్పుడు లోటు రానీకుండా శక్యమైనంత వరకు, సేవ చేస్తూంటాను.

ర—అంటే, తాగుళ్ళందించే పిల్లవా, ఈహోటల్లో?

వి—హోటలా? అయ్యో దేవుడా! మీ తలలోకి అల్లాంటిభావం ఎల్లా ప్రవేశించిందండీ? ఈ ప్రాంతాల ఉత్తమ కుటుంబాలలో ఒకటైఉన్న కుటుంబం హోటలు సాగిస్తుందా? అహ్హహ్హ (అని, నవ్వి) అబ్బే, హేమగిరిగారి భవనం హోటలేమిటండీ?

ర—(ఆలోచిస్తూ) హేమగిరిగారి ఇల్లు! చెప్పు, పిల్లా, చెప్పు! ఇది హేమగిరిగారి ఇల్లా?

వి—అవునండీ, రాఘవగా. ఇది మరొకరి యిల్లు ఎల్లాకాగలదు?

ర—అయితే, అంతా ఆఖరైందన్నమాట. నేను దగాపడి నాశనం అయాను. అయ్యో! నా మట్టితల బండలు గానూ, ఊరంతా నన్నుచూసి నవ్వుతారుకదా! ఈ భవనాన్ని మరోరకదేనా అనుకోక కేవలం ఒక హోటలు అనుకున్నానే! నాతండ్రికి చిననాటి స్నేహితుడైన వ్యక్తి హోటలుయజమాని అనుకున్నానే! నన్ను ఎంత విస్సాటం గల తుంటర్నిగా కట్టి ఉంట'డాయనా? నేను ఎంత అల్లరి బాజానని నాకే అనిపిస్తోంది! అన్నీ అల్లా ఉండగా, నన్ను ఉరితీసెయ్యా, ప్రియనారీ, నిన్నుచూసి, తాగుళ్ళిచ్చే పిల్ల దానివని పొరబడడం ఏమిటీ?

వి—అయ్యో నాపుణ్యం ఇద్దైపోనూ! అటువంటి రకం పిల్లతో తుల్యంగా నన్ను గణించడానికి వీలిచ్చే లక్షణాలు నా ప్రవర్తనలో మీకు ఏమీ గోచరించలేదని నేను విశ్వసిస్తున్నాను.

ర—ఏమీలేవు, ప్రియకన్యా, ఎంతమాత్రం లేవు. నేను వరసపెట్టి పొరపాట్లు చేసేశాను, ఆ వరసలోంచి నిన్ను మినహాయించలేకపోయాను. నా మందమతికి ప్రతీదీ తప్పుడుగానే కనిపించింది. నీ నిరంతరసేవ చూసి ప్రేమ దృఢీకరణమనీ, నీ అమాయికవైఖరి చూసి ఆకర్షణయత్నమనీ భ్రమించాను. కాని, ఆ శకం అయిపోయింది. ఇక, ఈ యింట్లో నాముఖం కనపరచలేను,

వి—మీకు నాయెడల విముఖత్వం కలిగేపని ఏదీ నేను చేయలేదని ఆశిస్తున్నాను. నన్ను ఎంతో మర్యాదతో చూసి ఎంతో ఆదరిందాగా నాతో ప్రసంగించిన మహనీయుడికి నేను కష్టం కలిగించడమనేది జరిగితే, నేను చాలా దుఖ్ఖించవలసిన విషయం. ఆయన (దీనంగా) నా మూలకంగా (వణుకుతూ) ఈ యిల్లు విడిచివెడితే, నేను చాలా (ఏడుస్తూ) దుఖ్ఖిస్తాను. అదీ కాక, నాశీలం తప్ప నాకు ఏ యితర ఆస్తీ లేదుగనక, రేపణ్ణించి అమ్మలక్కలంతా తలోమాటా నన్నుగురించి ఆడినా, నేను దుఖ్ఖిస్తూనే కూచోవాలి.

ర—(తనలో) అరెరే! ఏడుస్తోందే! మొహమాటం గల స్త్రీయొక్క హృదయ కోమలత్వాన్ని సూచించే చిహ్నం నాకు మొదటిసారి సందర్శించడం ఇదే. ఇది నా మనస్సుకి చురుక్కున తగుల్తోంది. (పైకి) క్షమించు మనోహారీ! ఇందరిలోనూ ఒఖ్ఖ నిన్ను గురించి తప్ప, ఇక్కణ్ణించి లేచి పోవడంలో నే నేమీ బాధపడను. కాని, ఉన్నసంగతి దాచి ఏంలాభం? మన పుట్టుకలలో మన ఐశ్వర్యాలలో మన చదువుల్లో వ్యత్యాసాలు ఉన్నాయిగనక, మనిద్దరికీ సగౌరవ సంపర్కం అసంభవం. మరి, నామర్యాదలో నమ్మకం ఉంచిన అమాయికురాల్ని లేవదీసుకుపోవడం గురించిగాని, చాలా అందంగా ఉండడంతప్ప ఇతర నేరం ఎరగని పిల్లయొక్క జీవితాన్ని నాశనం చెయ్యడంగురించిగాని, యత్నించను సరిగదా అటు

వంటి ఆలోచనకికూడా నామనస్సులో ఏమంత్రైనా జాగా ఇవ్వను.

వి—(తనలో) ఔర! ఎంత ఉదార స్వభావం గలవాడో! నామనస్సు ఈయన్ని మెచ్చడం ప్రారంభించింది. (పైకి) కాని, తమ రెరగరు, నా కుటుంబంకూడా హేమగిరి గారి కుటుంబ మంతటిదే. కాని, నేను పేదరాల్నే. అయితేం, తృప్తిగల మనస్సుకి దారిద్ర్యం అనేది పెద్ద దురదృష్టం కాదు. ఐశ్వర్య లోపం అనేది ఒకరకం చెడ్డతనం అని నేను ఈ గడియవరకు అనుకోలేదండీ!

ర—ఓసి అందాల అమాయికత్వమా! ఇప్పుడు మట్టుకు ఎందుకు అనుకోవలి వొచ్చింది!

వి—ఇప్పుడు అల్లా అనుకోడం ఎందు కంటారా? నాకు వేలాదిగా సొమ్ముఉంటే, నేను ఎవరికి ఇచ్చేసి ఉండేదాన్నో, అల్లాంటివాళ్ళ నుంచి నన్ను అది దూరం చేసేస్తోంది గనక!

ర—(తనలో) ఈ అమాయికత్వం నన్ను మంత్రించేస్తోంది. మరి కాస్సేపు ఇక్కడుంటే, నా పని పూర్తే. ధైర్యంగా గట్టియత్నంచేసి ఈ పిల్లని వదిలించుగోవాలి. (ఆమెతో) ఓ అమ్మాయి! నీకు నాయందుగల పక్షపాతం నామనస్సుకి గాఢంగా నాటింది. నేను నామీదే ఆధారపడి

జీవిస్తూ ఉండేవాణ్ణి. అయితే, నా వధువుని నేను నిమిషంలో ఎన్నుకుని ఉండేవాణ్ణి. కాని, జనవాక్యానికి చాలా చాలా ఋణపడీ, అంతకంటె చాలా తండ్రిగారి అధికారానికి ఋణ పడీ ఉంటూన్న వ్యక్తిని అవడంచేత—నేను అదేదీ మాట్లాడ లేకుండా ఉన్నాను—అది నామనస్సుని కలిచి పారేస్తోంది.

(అని గబగబా RM కి వెళ్ళిపోతాడు).

వి—(తనలో) ఈయన ప్రశ్నలో సగంకూడా, ఈ క్షణంవరకూ, నాకు తెలియలేదు. ఆయన్ని ఆపేసెయ్య డానికి నాలో శక్తిగాని నేర్పుగాని ఉంటే ఆయన వెళ్ళ జాలడు. నెగ్గడానికి నేను అవలంబించిన ఈ తక్కువ వేషం నే నిల్లానే అట్టేపెడతాను. మా నాన్నకిమాత్రం యథార్థం చెప్పేస్తాను. చెబితే అంతా విని మా నాన్న నవ్వేపారే స్తాడు. ఆ నవ్వేళ్ళి, వెళ్ళిపోవాలని ఈయన చేసుగున్న నిశ్చయాన్ని తరిమి పారేస్తుంది.

(అని గబగబా RM కి వెళ్ళిపోతుంది).

రంగం-౫

[ఖాళీగది L F నించి ముందు లకుముకీ, వెనకాల రంజనీ వస్తారు]

ల—అవును, రంజనీ! ఈమాట్లు ఆ పెట్టె నువ్వే తస్కరించుకుగో. నాపని నే చేశాను. చేస్తేం, మాఅమ్మ ఆ పెట్టె మళ్ళీ లాగేసుకున్నమాట రూఢి. కాని, చోరులు నాఖర్లే అనుకుంటోంది.

రం—అయితే, లకుముకి బావా, మమ్మల్ని ఇల్లా నట్టేట్లో వదిలేస్తావా? నేనుగాని వెళ్ళిపోతున్నానని ఆవిడ పసికట్టిందా, నన్ను ఎక్కడేనా పెట్టి తాళం వేసేస్తుంది. లేకపోతే మా మూలమ్మత్త దగ్గిరికి నన్ను తోలేస్తుంది. అక్కడ ఇక్కడికంటె పదిరెట్లు అఘాంద్రా.

ల—నిజమే. అత్తలు ఎక్కడాకుడా దిక్కుమాలి పదార్థాలు. నన్ను ఎంజెయ్యమన్నావ్ వదినా! అక్కడికీ రెండుగుర్రాలు సరఫరా చేశాను. అవి గాలిలా పోతాయి. మా అమ్మ చూస్తూండగల సమయాల్లో నిన్ను ప్రేమిస్తూ న్నట్టు నేను రమ్యంగా నటించ లేదని నువ్వు ఎట్లా అన గలవ్? (LM కేసి చూస్తూ) ఇల్లా వస్తోంది. ఆవిడ వచ్చే సరికి మనం ఇంకో కొన్ని శృంగారచేష్టలు అభినయించాలి.

ఆవలి _స్తే పేగుల్ని కొట్టపెట్టగల రకం, మాలక్ష్మి, ఆ మూలలు పడ.

(లకుముకీ రంజనీ R B కి వెళ్ళిపోతారు. లకుముకి రంజనిని వెంటాడిస్తున్నట్టు—చూపులు చూసీ, ఈలలు వేసి, సంజ్ఞలు చేసి, వినపడని మాటలు చెబుతూ వ్యవహరిస్తాడు. ఇష్టం ఉండీ గింజుకుంటూన్నట్టు రంజని నటిస్తూంటుంది.)

కం—(L F నించి ప్రవేశిస్తూ) అబ్బ! నేను చాలా కంగారు పడిపోయాను. నేరం జరిపినవాళ్ళి నొక్కళ్లే అంటాడు మా లకుముకి. ఏమో! వీడికీ రంజనికీ సుబ్బరంగా ఇంత వివాహం అయిపోవాలి, నాకు నిద్దరట్టాలి. అప్పుడు కావలి _స్తే రంజని ఆస్తి రంజనిని పుచ్చుకోమనండి. (R B కేసి చూడడం అభినయించి) కాని, అబ్బోఅబ్బో. ఏమి లేమిటీ? ఒకర్నొకరు బుజ్జగించుగోడాలా? ఓరి నేను ఇద్దైపోనూ! ఈ వేళంత చలాకీగా నా లకుముకిని ఎన్నడూ చూడలేదు. (తలతిప్పుతూ) ఆఁ ఆఁ దొరికాడు లెండోయ్, చూశాను. పావురాయి పిట్టల్లాగ చిట్టిచిట్టి కూతలూ దొంగ పోటుగా చూసుగోడాలూ, ఆగుతూ ఆగుతూ గుసగుసలూ! చూశాను, చూశాను.

ల—అమ్మా! గుసగుసలమాట నిజమే. కాని, అప్పుడప్పుడు సణుక్కోడాలు కూడా ఉన్నాయి. ఒకర్ని ఒకరం ఖాతరీ చెయ్యం.

క౦—అంటే ఏమిటో తెలుసా, లకుముకీ, మంట మీద నూనెచుక్క. ఆ తరవాత మంట మరీ భగ్గు మంటుంది.

ర౦—అత్తోయ్ ! మరిట, లకుముకి బావట, ఇంటి దగ్గిరే చాలా తమాషాలు చూపిస్తాడట ! ఇంటి దగ్గిర్నించి ఇక వెళ్ళనే వెళ్ళడట. అది మన్ని వదల్దుకాదు, బావా, వదల్దు ?

ర—నువ్వెప్పుడు నవ్వినట్టు నవ్వుతూంటావనుకో, అవతల గుఱ్ఱం బండెపడ్డాసరే, నేను కదలనే కదలను, పనస్వ నీమొహంకోసం చెయించినట్టు ఉంటుంది.

ర౦—అమృత తుల్యుడవ్, బావా ! ఎవరు మెచ్చ రేమిటి, ఆ సహజ స్వారస్యం, విశాలంగా ఎర్రగా రెండో ఆలోచన లేకుండా ఉన్న ఆ (అని దవడమీద తాటించి) చెక్కిలీ ! ఔర ! కొట్టొచ్చేలాంటి ముఖం !

క౦—ఈ అమాయికత్వం ఎంతముద్దొస్తోందో !

ల—నాకు రంజని నేత్రాలంటే, పొడుగాటి ఆ వేళ్ళంటే మొదణ్ణించీ నిజంగా ఇష్టమే. వీణలాంటిది వాయించే టప్పుడు తీగెలకి వేళ్ళు చుట్టుగుపోతాయి, దారపుఉండకి దారంలాగ !

క౦—అమ్మ ! అమ్మలకుముకీ ! వీడి ఆకర్షణకి కొండ మీంది కోతికూడా దిగి చక్కావస్తుంది. ఇం తానందం నా కెన్నడూ కలగలేదు. నా బిడ్డ, మూడుమూర్తులా, ఆ గతిం

చిన తండ్రిపోలిక ! రంజనీ, పిచ్చితల్లీ, ఆనగలన్నీ వెంటనే నీ కిచ్చేస్తాలే, అమ్మా ! నువ్వే పుచ్చుగుందుగానిలే! చెప్పవే రంజనీ ? నాబిడ్డ మనోహరంగా లేదూ ? మీారు రేపే ఆడు దురుగానిపెళ్ళి. మిగతాచదువు శిక్షాకోసిరి. మరోఅప్పుడు వీలుచూసుగుని కానియ్యొచ్చు.

దు—(R F నించి వస్తూ) చిన్నయ్య ఉన్నారా ? తమరుగారికి ఉత్తరం వచ్చిందండి.

ల—మా అమ్మకియ్యి, నా ఉత్తరాలన్నీ మొదట చదవడం ఆవిడే.

దు—స్వయంగా ఇది మీాచేతులోనే ఉంచాలని ఆజ్ఞాపించారండి.

ల—ఎవరు రాసినవారు ?

దు—ఆమాట దేవరవారు ఆ ఉత్తరాన్నే అడగండి.

ల—(ఉత్తరం పుచ్చుగుని తిరగేస్తూ) నా కుతూహలం ఏమి టంటే,......

ల—(తనలో) చచ్చాన్రా దేవుడా, నాశనమే ! హృదయనాథం దగ్గిర్నించి. ఈదస్తూరీ ఆయనదే. ఇది మా అత్త చూసిందంటే మాపని ఎల్లకాలానికీ మట్టం అయిం దన్నమాట. వీలైతే ఈవిణ్ణి కాస్త పక్కకితీసి, పనిచెబు తాను. (కంఠాలమ్మతో) కాని, అత్తోయ్ ! నీతో నేను చెప్పనేలేదూ ! ఆ రత్నమణిగారికి ఇచ్చాడు, బావ, చురుక్కుమనిపించే సమాధానం ! అబ్బబ్బ ! మాచెడ్డ నవ్వే

శ్యాం. అత్తా, నువ్వు వినాలి—ఈపక్కకిరా! బావ విన కూడదు.

(అని కంతాలమ్మని L B కి తీసికెళుతుంది.)

ల—(ఉత్తరం కేసి చూస్తూ) ఛీ, అగమ్యం; పాడు, దిక్కుమాలి కలంపని! ఇంతపాడుగా ఎదీఉండదు. అచ్చు దస్తూరీ దంచికొట్టి చదివేస్తాను. కాని, ఇందులో వంకర టింకర్లూ, వాలురేఖలూ, అడ్డుగీతలూ—బోలెడున్నాయి. మొత్తంమీద తలాతోకా తెలియడంలేదు. (పైన చదువుతూ) "లకుముకి రాజాగారికి"—ఆశ్చర్యమే. నాపేరులో ఉండే అక్షరాలైతే నేను బాగానే పోల్చుకోగలను. కాని, ఉత్తరంచింపి లోపలప్రవేశిస్తే, అంతా అలికేసినట్టుంది. కష్టంగాఉంది, చాలా కష్టంగాఉంది. అయితేం, ఉత్తరానికి లోపల ఉండే సరుకే అసలు నిగ్గు వ్యవహారం.

కం—అహ్హాహ్హాహ్హ (అని నవ్వుతూ L B నించి వస్తూ) బాగుంది, బాగుంది, చాలా బాగుంది. అందుకని, నా చిన్నారికూన అవతల జ్ఞానికి కొరుకు పడలేదన్నమాట!

రం—మరే అత్తా. కాని, మిగతాది మరీచిత్రం, అత్తా. కాస్త, ఇటింటా, రా. లేకపోతే, అతను వింటాడు. మరోసారి ఇతడు అవతలాయన్ని ఎల్లా చిక్కుపరిచాడో విందుగాని.

కం—(లకుముకి కేసి చూస్తూ) ఉండవే. వీడే చిక్కులో పడ్డట్టున్నాడు.

ల—(ఇంకా ఉత్తరం కేసి చూస్తూ) దిక్కుమాలి దస్తూరీ, హెచ్చులూ తగ్గులూనూ, సారాలో దాగుడు ముచ్చీలు ఆడుతూన్నట్టు! "మహాశయా,"—ఇది తెలు స్తోంది. దానిముందు రెండక్షరా లున్నాయి. ఒకటి 'ఇ' రెండోది 'షు' లాగ ఉంది. అసుగుస ఎదోఉంది. అది 'లు' కావచ్చు, లేకపోతే 'ట' ఎమో! నాతల పాడైపోను, నేను చెప్పలేనాయిరి.

కం—అదేమిట్రా, నాకన్న! సాయం చేసిపెట్ట మన్నావా ?

రం—ఉండత్తా, దయచేసి, నన్ను చదవనీ. గందర గోళపు దస్తూరీలు నాకంటె బాగా ఎవరూ చదవలేరు. (అని, లకుముకి చేతులోంచి ఉత్తరం లాగేస్తుంది). ఇది ఎవరిదగ్గిర్నించో తెలుసా ?

ల—ఎమో! ఒఖ్ఖడే అయిఉండాలి—కోళ్ళని మేపు తాడూ, డీడిక్కులముంజయ్య—వాడేమో!

రం—సరిగ్గా వాడే! (అని, అందులో ఉన్న ప్రకారమే చదువుతూన్నట్టు నటిస్తుంది) ప్రియమైన చినరాజా! మీరు కులాసాగా, నే నిప్పు డున్నట్టే, ఉన్నారనుకుంటాను. మొన్నటి కోడిపందెంలో రాంబందు సంఘసభ్యులు డేగసమితి మహానుభావుల్ని రెక్కలూడగొట్టి పంపించేశారు. ఇటుల— కాదు కాదు—ఇటూ అటూ విజయం—అనేది—ఊఁ—అతిదీర్ఘ మైన—ఊఁ—ఆ దెబ్బలాటలో—ఇక్కడ.....ఇక్కణ్ణించి

రాసింది యూవత్తూ కొళ్ళని గురించి దెబ్బలాటగురించీనూ. ఇందులో ముఖ్యమైంది మరేమీ లేదు. దాచెయ్, ఇదుగో, దాచెయ్! (అని ఆ ఉత్తరం నలిపేసి లకుముకి చేతిలో పెడుతుంది)

ల—చెబుతున్నాను, పిల్లా. ప్రపంచంలో ఈ ఉత్తరం ఎంతముఖ్యంబడితే అంతముఖ్యమైన ఉత్తరం, కడంది యూవత్తూకుడా చదవకుండా నే నేమిచ్చినా సరే నూనను. అమ్మా! ఇది నీకు తెలుస్తుందేమో చూడు. ఇదేమీ ముఖ్యమైంది కాదుట, చెప్పడానికి బయల్దేరింది తగుదునమ్మా అని. (అని అది కంఠాలమ్మచేతి కిస్తాడు)

కం—(ఉత్తరం విప్పిచూస్తూ) ఇదేమిటోయ్! ఓహోహో! (అని, చదవడం మొదలెట్టి) "ఇష్టుడైన చినరాజా! నే నిప్పుడు తోటకిందిస్థలంలో రంజనికోసం కనిపెట్టుకుని ఉన్నాను. అంచీబండీ గుర్రాలూ సిద్ధంచేశాను గాని, గుర్రాలు ప్రయాణంచెయ్యగల స్థితిలో లేవు. మీ వాగ్దానప్రకారం, మీరు రెండు రాజాగుర్రాల్ని తీసుకొచ్చి సాయంచేస్తారని ఆశిస్తున్నాను. వేగిరపడడం అత్యంత అవసరం. లేకపోతే, శనిపీనుగైన—కేవలం శనిపీనుగైన—మీ అమ్మ అనుమానపడుతుంది. విధేయుడు, హృదయనాథం"—అబ్బ! కాస్సేపు తాళుకోనియ్యండి. నాకు మతిపోగలదు. నా కోపం నా కంఠానికి అడ్డుపడి మాట్లాడనియ్యకుండా ఉంది.

రం—ఉం డత్తా, కోపం ఒకక్షణం తనూయించుగో మ్మరీ ! ఇందులో ధిక్కారంగాని సుష్టపన్నాగంగాని ఏదేనా ఉంటే, అది మరొకరిది గనక, అది నాకు అంటగట్టవని ఆశిస్తున్నాను.

కం—(వంగి వినయం నటిస్తూ) దివ్యంగా మాట్లాడావు, రంజనీదేవీ ! మిక్కిలి ఎక్కువ దుష్టత్వంతో కూడిన నీ ఆరిందా నీ కాలయాపనా నీ సంఘమర్యాదా నీ డొంక తిరుగుడూ కేవలం ఆదర్శప్రాయాలు. (కంఠస్వరం తీవ్రం చేసి) ఇక నువ్వు ! నోరుమూసుగోడం క్షేమం అనేపాటి బుద్ధేనా లేని ఓరి అవకరపు దద్దమ్మా ! నువ్వుకూడా నామీద కుట్రే ? కాని, క్షణంలో మీా పన్నాగాలన్నీ భగ్నంచేసేస్తాను. నీసంగతి విను, దేవీ. తాజాగుర్రాల్ని సిద్ధంచేసుగుని ఉన్నావుగనక, వాటికి ఆశాభంగం కలిగించండం క్రూరం. అందుకని, దయచేసి, రంజనీ, నీ రంజకుడితో లేచిపోడం బదులు, ఈ క్షణమే, నాతో లేచిపోదుగాని ! మీా మూాల మ్మాత్త నిన్ను జాగర్తగా చూాస్తుంది, నాకు రూఢిగా తెలుసు. మీారుకూడా, ఓ అయ్యగారు, మీారుకూడా ఓగుర్రాన్నెక్కడాగ్లో మాకు సాయం ఉండాలి. ఇక ఈ నౌఖరీవాళ్ళ పని పట్టాలి. (అని చాలాకోపంగా L M కి పోతుంది)

రం—అయింది. నాకు సర్వనాశనం అయింది.

ల—అదెప్పుడూ రూఢిగా జరిగేదే.

రం——నీతో సహవాసం అయినప్పుడు ఏంజరుగు తుంది ఇంతకంటె ? నేను ఎంత తిప్పాగుని ఎన్ని సంజ్ఞలు చేస్తేం, ఎద్దుమొద్దుస్వరూపంలా ఉండిపోయావేగాని !

ల——శాసనాలు సాక్షిగా, చెప్తావినుదేవీ ! నిన్నిల్లా చేస్తా నా మూర్ఖత్వంకాదు, నీ తెలివితేటలు. నువ్వు ఏమి శేమిటో—రాంబందు సంఘమూ, డేగసమితీ—ఏకరువెట్ట డంలో పడిపోయావుగదా ఎవడికి నమ్మకం కలుగుతుందీ అని నే ననుకున్నాను.

హ్యా——(R F నించి వస్తూ) ఏమయ్యా, నా ఉత్తరం బయటపెట్టేశావుట, న్యాయమేనా, మహాశయా !

ల——ఈయన ఒకడూ ! ఈయనా నన్నే. ఈ అమ్మా యిని కనుక్కోండీ బయటపెట్టింది ఎవరో తెలుస్తుందీ! దేవుడు తోడు, ఆవిడపనే, నే చేసిందికాదు.

[R F నించి ఉసూరుమంటూ రత్నమణి వస్తాడు]

ర——మీా అందరి సమక్షంలో, నాపని మా బాగా అయింది. నన్ను అసహ్యించుకున్నారు, అమర్యాదపన్లు చెయ్యవలిసొచ్చేట్టు చేశారు, నన్ను ఛీ అని ద్వేషించారు, తూలనాడారు, నవ్వులాటకి పట్టించారు.

ల——ఈయ నొకడూ ! అంతా కూడుతున్నారు. పిచ్చిఆసుపత్రి తలుపులు తీసేసినట్టు అవుతోంది.

రం——మనం అంతా ఎంతైనా ఋణపడి ఉండవలి స్సింది, ఈ మహానుభావుడి కేనండి. (అని లకుముకిని చూపి స్తుంది).

ర——అతడు కుఱ్ఱాడూ మూర్ఖుడూనూ! వయస్సూ అజ్ఞానమూ అతణ్ణి కవచాలలాగ రక్షిస్తూంటే ఏమనగల్ను అతనితో!

హృ——అసహ్యంవేసే దిక్కుమాలి కోతిగాడు! ఇతణ్ణి తప్పు దిద్దితే, దిద్దినవాడికగుడా తలవంపు.

రం——అయినాసరే, మళ్ళీ ఎంతజిత్తులమారీ దుర్జ నుడూ అనుకున్నారు, మనందరం చిక్కులు పడుతూండే టప్పుడు మనఖర్చుమీద తను సొమ్ముచేసుకుని కులుకుతూ కూచోగలడు.

హృ——బుద్ధిలేని జంతు సంతానం!

ర——వంటినిండా జిత్తులూ అల్లరిరసమూనూ!

ల——అబ్బా! నన్ను చంపుకున్నంతపట్టూ! మీ యిద్దరితోనూకుడా దెబ్బలాడతాను, మొదట ఒకడితోనూ, తరవాత రెండోవాడితోనూ!—ఆయుధాలు తెట్టలు.

ర——అతడికేం? అతడు మన కోపానికికుడా బలా దూరే! కాని, హృదయనాథంగారూ, తమ ప్రవర్తన గురించి తమరు నాకు సంజాయిషీ చెప్పవలిసి ఉంటుంది. నేను పొరపాట్లు చేసేస్తూంటే, యథార్థం నాకు మీరు చెప్ప లేదే? దగాలోంచి నన్ను వదిలించలేదే?

హృ—ఆశాభంగాలతో హృదయం ఉడికిపోతూండే ఇటువంటి సమయంలోనా సంజాయిషీలు చెప్పడం? అట్లా అడగడం స్నేహధర్మమా, రత్నమణిగారూ!

ర—అది కాదండీ......

రం—రత్నమణిగారూ! శృతి మీరిపోయేవరకూ మీరు దగాలోంచి బయటపడకుండా మిమ్మల్ని మీ పొరపాటులోనే ఉంచుతా, మేం కాదు.

[L F నించి దుర్గయ్య వస్తాడు]

దు—ఓ అమ్మాయి! మిమ్మల్ని తక్షణం సిద్ధం కమ్మన్నారు, అమ్మ! గుర్రాల్ని పూనుస్తున్నారు. మీ దుస్తులూ అవీ పక్కగదిలో ఉన్నాయి. ఉదయం అయ్యేసరికి ముప్పై మైళ్ళు వెళ్ళాలిట. (అని వెడతాడు)

రం—సరే సరే, ఇప్పుడే వస్తాను.

ర—(హృదయనాథంతో) ఏమయ్యా, నీకు సవ్యంగా తోస్తోందా, నన్ను హాస్యాస్పదుణ్ణిగా చేసేవాళ్ళకి నువ్వు తోడవడం! నా పరిచితులంతా నన్ను నిరసిస్తూంటే నన్ను విశిష్టా చేసెయ్యడం! నమ్మండి, నేను సంజాయిషీ కోరి తీరతాను.

హృ—సవ్యంగా తోచడంమాట మీ రన్న దేగనక, నేను మీ చేతికి దాచయిచ్చింది మీరు మరొకరి చేతి కివ్వడం మీకు సవ్యంగా తోస్తోందా?

రం—రత్నమణిగారూ! హృదయనాథంగారూ! ఇలాంటి నిరాధారపు దెబ్బలాటతో నాశోభ మీరు ఎం

దుకూం ఎక్కువ చెయ్యడం ? బతిమాలుతున్నాను, అర్థిస్తు న్నాను......

దు—(L F నించి వస్తూ) ఇదుగో మీమ్మ స్తు. అమ్మ గారు తొందరచేస్తున్నారు. (అని L F కి పోతాడు).

రం—వస్తున్నాను. అయ్యా ! శాంతించండి. ఈ స్థితిలో మీరుండగా నేను వెళ్ళవలిసొస్తే. హృదయ తెత్తిపోయి నేను మరణించాలి.

దు—(L F నించి వస్తూ) ఇవిగోనండి—మీా విసిని కఱ్ఱ, చేతికప్పు, వేళ్ళతొడుగులు. గుఱ్ఱాలు కనిపెట్టు గున్నాయండి.

రం—రత్నమణిగారూ ! నేను ఎటువంటి నిర్బంధనా నిరాదరణాల్లో కూడిన రంగంలో దిగనై ఉన్నానో మీరు గమనిస్తే, మీ కోపాన్ని జాలిలోకి మార్పుచేస్తారని నా విశ్వాసం.

ర—నా మనోవ్యాపారాలు ఎంత వివిధంగా ఉన్నా యంటే, నేను ఏంజేస్తున్నానో నాకు తెలియడం లేనంత. అమ్మా, నన్ను క్షమించు. హృదయనాథ్, నన్ను క్షమించు. నాదగ్గిరకుడా కొంత పాలు కోపందినుసు ఉన్నసంగతి నీకు తెలుసుగా, దాని అంతు చూడకు నీకు పుణ్యం ఉంటుంది.

హృ—నాస్థితిలో ఉండే యమబాధే నాకోపానికి నెపం.

రం—(హృదయనాథంతో) అయ్యా, నేను అను కున్నంతగా మీరు నన్ను గౌరవిస్తూంటే—గౌరవిస్తున్నారని

నానమ్మకం—మరి మూడుసంవత్సరాలు మీరు స్థిరచిత్తులై ఉండగలిగితే, మనకి కాబోయే సంపర్కంయొక్క సౌఖ్యం ఇనుమడిస్తుంది,

కం—ఓసి, రజనీ! ఏమే! రావే!

రం—వచ్చె వచ్చె! జ్ఞాపకం ఉంచుగోండి. స్థిరచిత్తత్వం! (అని L F కి వెడుతుంది).

హ్య—అబ్బ! ఈ యెడబాటు ఎంత దుర్భరం! అందులోనూ, సౌఖ్యానికి—ఇటువంటి సౌఖ్యానికి—చేరువులో—ఇంత చేరువులో—ఉండగా! అయ్యో!

ర—(లకుముకితో) చూశావయ్యా, పెద్దమనిషీ, నీ తప్పుమూలాన్ని కలిగిన ఫలితాలూ? ఇది నీకు తమాషా అయితే, ఇవతలవాళ్ళకి ఆశాభంగమూ ఇంకా పడితే శోభాకుడానూ!

ల—(ఏదో ఆలోచించు గున్నట్టు కళ్ళుమూసి, తెరిచి) దేవుడుతోడు. అదీఎత్తు. అదే. ఏవి మీచేతులు? మీవండీ, విచారమూర్తిగారు! నా చెప్పులెవీ, ఓ, అవా? రెండుగంటల తరవాత నన్ను తోట కిందిస్థలంలో కలియుండి. అప్పుడు,, ఈ లకుముకి, మీ రనుకున్నకంటె ఎక్కువ సత్స్వభావం కలవాడని మీకు కనబడకపోతే, మీకు సర్వాధికారమూ ఇచ్చేస్తాను, మీరు నా మిక్కిలి మంచిగుర్రాన్ని లాక్కుపోండి, నా సరసురాల్ని ఈడ్చుకుపోండి. గండర్రా, నా చెప్పుల్లారా! (అని, చెప్పులు తొడుక్కుని, గబగబా R F కి పరిగెడతాడు—తెర).

## రంగం-8

[రెండో తెర ఎదట ఖాళీస్థలం, R F నించి హృదయ
నాథం దిగాలుపడి ప్రవేశిస్తాడు]

హృ—(తనలో) ఛార! నౌఖరు చెప్పిందాన్నిబట్టి, ఆ ముసిలావిడ రంజనిని గుఱ్ఱపుబండిమీద ఎగరేసుకు పోయిందిట. వాళ్ళ సరసని చిన్నరాజుకూడా గుఱ్ఱంమీద వెళ్ళాడట. ఈపాటి ముప్పై ఫర్లాంగ్లు వెడతారట. ఇంకెక్కడ రంజనీ! ఊతోట దిగువని ఎందుకూ కనిపెట్టుగుని ఉండడం. చిన్నరాజాకోసం? నేను మూర్ఖుణ్ణి. నేను యమయాతనల్లో ఉంటూన్నప్పుడు నన్ను చూడడం వాడికి ఆనందంగావును. అన్నవేళకి వచ్చేఉద్దేశం లేదేమో ఆ పాపిష్టికి! మరి నేను ఆగను. ఆఁ ఆఁ (అని L F కి చూస్తూ) ఎవరది? వాడు లాగేఉందే, వాడే! రంజనిగురించి బహుశా ఏదో చెబు తాడు.

[L F నించి, మోకాలువరకూ ఉండే చెప్పుల్తో, ఒంటినిండా
బాడితో లకుముకి వస్తాడు]

హృ—మీరు చాలా నిజాయితీవారండీ, చిన్నరాజా! అన్నమాటకి నిలబడేవారు మీరు అని నాకిప్పుడు తెలిసింది. ఇదీ స్నేహం అనిపించేది.

ల—ఆ, మీస్నేహితుణ్ణి. మీకు ఉండగల స్నేహి తుల్లో ఉత్తముణ్ణి. అంతా విన్నతరవాత, మీరేఅంటారు.

కాని, రాత్రివేళ స్వారి చెయ్యడం శ్రమానరకమూనూ. కతకలరోడ్డుమీద అంచీబండిలోకంటె ఎక్కువగా కుదుపు తినేశాను.

హ్యా—చెప్పండి, చెప్పండి. కూడా ఉన్నవాళ్ళని మీరెల్లా తప్పించుగున్నారూ? వాళ్ళు క్షేమంగా ఉన్నారా? ఇల్లు చేరుకున్నారా?

ల—రెండుగంటలన్నరలో, ఇరవై అయిదు మైళ్ళు మరీ మందకొడిప్రయాణం అంటారా? గుర్రాలు, పాపం, నెమళ్ళు కక్కుతున్నాయి. నక్క వెనకాలే ఓ నలభై మైళ్ళు స్వారి చెయ్యొచ్చుగాని, ఈ జంతువుల వెనకాల పదిమైళ్ళు వెళ్ళడం కుడా ప్రాణపోక టే, దేవుడుతోడు.

హ్యా—సరేసరే, ఆ స్త్రీలని మీరు ఎక్కడ దిగ విడిచారూ? ఆ సంగతి తెలుసుగోడానికి ఎంతో ఇదై పోతున్నాను.

ల—దిగవిడవడం ఏమిటి? వాళ్ళు ఎక్కడ కనిపించారో అక్కడే దిగవిడిచాను.

హ్యా—ఇదేదో సమస్యలాఉందే?

ల—ఎటువంటిదో వినండి. ఇంటిచుట్టూ తిరగడం, మళ్ళీ యింటిచుట్టూ తిరగడం, ఇంటినిమాత్రం ముట్టుగోకుండా ఉండడం! అంటే ఏమిటీ?

హ్యా—నాకింకా బోధపడలేదు.

ల—ఆఁ ఏముందయ్యా, వెర్రివాడా! దారి తప్పించేశాను. చుట్టుపక్కల ఏముందో వీళ్ళకేం తెలుసూ?

హ్రా—అహ్హాహ్హ (అని నవ్వుతూ) అదా! తెలిసింది. ముందుకి సాగిపోతున్నాం అని వాళ్ళు అనుకుంటూండగా, వాళ్ళని గిరగిరా తిప్పేసి, చిట్టచివరకి యింటికే తీసుగొచ్చావన్నమాట!

ల—చెబుతా వినండి. మొట్టమొదట్లోనే బండీ మెత్తావారి సందులోంచి పట్టించాను. అక్కడే అసలు బండీ బురదలో కూరుకుపోయి ఓ పట్టాన ఊడిరాలేదు. అక్కణ్ణించి ఎల్లానో పెల్లగిలి బండీని ఎగుడుదిగుడు కొండ ఎక్కించి ఆ రాళ్ళమీద వాళ్ళిద్దర్నీ గలగలలాడించాను. ఆ తరవాత భారీచెట్ల చిట్టడివిలో ఉరికంబం వాళ్ళిద్దరికీ పరిచయంచేసి, మరో చుట్టుదార్ని కొట్టుగొచ్చి, తోట దిగువని ఇక్కడే గుర్రాలగుంటలో వాళ్ళిద్దర్నీ పదిలంగా బోల్తా కొట్టించాను.

హ్రా—హరి! ప్రమాదం ఏమీ జరగలేదని ఆశిస్తున్నాను.

ల—అబ్బెబ్బే, ఏమీ లేదు. మా అమ్మమాత్రం కంగారుపడి తారెత్తిపోయింది. ఇంటిదగ్గిర్నించి నలభైమైళ్ళు వచ్చేశాం అనుకుంటోంది. ప్రయాణంతో ఆవిడ ఒళ్ళు హూనం అయింది. గుర్రపుగొడ్లు కాలుతీసి కాలెట్టలేకుండా ఉన్నాయి. అందుకని, మీగుర్రాలు తాజాగా ఉంటే, వదినెని తీసుగుని మీరు ఉడాయించండి, ఇక్కడ ఒక్కపిట్టకుడా మిమ్మల్ని

వెంట తరమడం విషయంలో తృణమైనా సాయం చెయ్య్యడని పూచీపడతాను.

హ్యా—ప్రియనేస్తమా ! ఎట్లా నీఋణం తీర్చడం ?

ల—అప్ప నవును. ఇప్పుడు టండీ నన్ను ప్రియనేస్తం అనడం, మహాశయా ! కాస్సేపటి కిందట—మూర్ఖుడు, జంతు సంతానం లాంటివి అన్నీ అంటూ సంధులు తెగ్గొట్టేశారు. మీపోట్లాట దిక్కుమాలిరకం అంటాను. ఈప్రాంతంలో ముందోసారి చావగొట్టడం, తరవాత ముద్దెట్టుగుని స్నేహితులై పోడం. కాని, మీరు పూర్తిగా నా సంధులు తెగ్గొట్టి ఉంటే, నేను చచ్చిపోయుంటే, అప్పుడు మీరు ఉరితీసేవాణ్ణి ముద్దెట్టుగోవలి సొచ్చేది.

హ్యా—నీ మందలింపు చాలా న్యాయంగా ఉంది. కాని, వేగిరంవెళ్ళి రంజనిని గట్టుచేర్చాలి. కొంచెం పనిచెప్పి నువ్వు ఆ ముసిలావిణ్ణి పక్కకి లాక్కెడితే, ఆ పడుచావిడ జాగర్త నేను పడతాను.

ల—నన్ను నమ్మండీ. కాని, ఇల్లా వస్తోంది, మా అవ్వ. (అని L F కి చూసొస్తాడు). మీరు త్వరగా మాయం కావాలి. ఆవిడ బురదలోంచి ఊడి పైకొచ్చింది, నడుం దాకా బాడితో మత్స్యకన్యలా ఉంది.

హ్యా—(R F కి పోతాడు)

[LF నించి బాడితో కంతాలమ్మ వస్తుంది.

కం—అయ్యో, లకుముకీ, చచ్చాన్రా. ఒళ్ళు పచ్చడైంది, ఎముకలు పొడుం అయినాయి. ఈగంగం నేను గడవను. ఓ పెద్ద కుదుపుతో మేం ముళ్ళపొదలల్లో పడ్డామూ, అది నన్ను బొత్తిగా మట్టంచేసేసింది.

ల—అవును పాపం. కాని, అమ్మా, అదంతా నీతప్పే. రాత్రి చీకట్లో లేచిపోడం ఎందుకు చెప్పు, దారి సంగతి అంగుళమేనా నువ్వెరగనప్పుడు.

కం—అయ్యో! ఇంట్లోనేనా పడిఉన్నానుగాను. ఇంత స్వల్పప్రయాణంలో ఇన్ని ఎక్కువ ఘోరాలు నాకెన్నడూ జరగలేదు. బాడినీళ్ళు ఒళ్ళంతా చిందడం, బురద గుంటలో బోల్తాకొట్టడం, అడుసులో గట్టిగా కూరుకుపోవడం, ముద్ద అయేలాగు ఇటూ అటూ పడుతూండడం, చివరికి దారికాస్తా తప్పిపోవడం! మనం ఇప్పు డెక్కడున్నట్టు, లకుముకీ!

ల—నా ఊహప్రకారం ఈస్థలం భగ్నకపాలం అనే బయలు. మనింటినించి నలభై మైళ్లు వచ్చిఉంటాం.

కం—అయ్యోదేవుడా, అయ్యోదేవుడా! దేశంలో కల్లా పాడుపేరు ఉంటూ, దీనికే! దొంగతనం ఓటిలోటైంది గాని, కడం ముచ్చట్లన్నీ జరిగాయి ఈరాత్రి.

ల—అమ్మా, భయపడకు భయపడకు. ఇక్కడ ఎయిమగు రుండేవారుగాని, ఇద్దర్ని ఉరితీసేశారు. కడం

ముగ్గురికీ మనం కనపడి ఏడిశామా? ఏమీ భయపడకు. (LM కి నడిచి చూసి) ఎవడేనా మన వెనకాలే ధైాడుతీసి వస్తున్నాడా? అబ్బే! అది ఓ చెట్టులే. భయపడకు అమ్మా!

కం—అయ్యో! ఇంకా భయపడడానికి ఏిలేదీ? అసలు ఇప్పు డున్న భయంతో నే పోతుంది, నాప్రాణి.

ల—(RF కేసి చూస్తూ) అమ్మా, చూడు చూడు. ఆ పొదవెనకాల నల్లటి టోపీలాంటిది ఏదేనా కదుల్తూన్నట్టుందా?

కం—ఇంకేముంది, చచ్చిపోయూన్నా, చప్పగానూ! (అని, కళ్ళుమూసుగుంటూ, చూస్తూ, ఉంటుంది.)

ల—అబ్బే, అది ఆవు, భయపడకు, అమ్మా, భయపడకు.

కం—(వణుకుతూ) లకుముకీ. నేనే జీవించిఉంటే, ఎవడో ఇల్లా వస్తున్నాడు. ఆహా, రూఢి. వాడు మన్ని చూశాడా, అయింది మనపని.

ల—(తనలో) చచ్చాంరా దేవుడా, మా సవితి నాన్న. రాత్రి మామూలుప్రకారం గస్తీ తిరగొచ్చాడు గావును. (తల్లితో) మరెవరూ లేదమ్మా! ఎవడో బందిపోటు వాడు! రెండు తుపాకులు తెస్తున్నాడు. అవి నాచేతికంటె బాలుగా ఉన్నాయి. చూడ్డానికి దిక్కుమాలి దెయ్యంలా ఉన్నాడు.

కం—దేవుడేదిక్కు, వచ్చిపడతాడు.

ల—(L B సూచిస్తూ) ఆమూల దాక్కో. వీడి గ్రంథం నేను కనుక్కుంటాను. మరీ ప్రమాదం వచ్చినప్పుడు దగ్గుతాను, లేకపోతే ఉంహుం అని సకిలిస్తాను. నేను దగ్గినప్పుడల్లా మరీ ముడుచుకుని కూచో, లేకపోతే నీకు ప్రమాదం.

కం—(కొంచెం మొహం కనపడేటట్టు కప్పుకుని, L F కేసి కూచుంటుంది.)

హే—(R F నించి వస్తూ) పొరపాటా, లేక కేకలు నిజంగా వినిపించాయా? ఓరి, నువ్వే! అప్పుడే తిరిగివస్తావనుకోలేదే! మీ అమ్మ ఏదీ? క్షేమమా?

ల—(ఆ, అన్నట్టు తల తిప్పుతూ, దగ్గుతాడు.)

కం—(నోరు తెరిచి కళ్ళు తేలేస్తుంది.)

హే—మూడు గంటల్లో నలభై మైళ్ళు మరీ శ్రమేమో!

ల—పుష్టిగల గుర్రాలూ ఇష్టంగల మనస్సులూ ఉంటే ప్రయాణం ఎంతసేపండీ! (అని మళ్ళీ దగ్గుతాడు.)

కం—(వణికిపోయి, నోరు మూసుకుంటుంది.)

హే—మరో గొంతికకూడా వినబడింది. ఎక్కణ్ణించి వచ్చిందో చెబితే సంతోషిస్తాను.

ల—అబ్బే, నేనేనండీ. నాతోటే నేను మాటా పలుకూ ఆడుకున్నాను. నలభై మైళ్ళు నాలుగుగంటల్లో మంచి వేగమే అనుకున్నాను. (అని మళ్ళీ దగ్గుతాడు.)

కం—(చాలా హడిలిపోతుంది.)

ల—అబ్బ, రాత్రి నుంచుమూలాన్ని గాలిలో తిరిగితే గొంతిగ పట్టేసిందండి. లోపలికి పోదాం పదండి.

హే—నీలో నువ్వు మాట్లాడుకుంటూంటే, మరీ, సమాధానం మరోరు చెప్పారేం? నాకు రెండు గొంతికలు వినిపించాయి. (గొంతిగ హెచ్చించి) ఆ రెండోవార్ని కనుక్కొని తీరతాను. (అని L F కి నడవబోతాడు.)

కం—(లేచి, L F కి నిష్క్రమిస్తుంది.)

ల—ఆగండి ఆగండి. ఎందుకండీ మీకు శ్రమా! నేనే చెబుతానుగా! (అని దగ్గి) సత్యానికోసం నేను ప్రాణం ఇచ్చేస్తాను. సత్యం మూవత్తూ చెప్తాను (అని ఇంకా దగ్గుతాడు.)

హే—నువ్వాపితే ఆగుతాననుకున్నావా? నేను కనిపెట్టి తీరతాను. నీమాటలు నమ్ముతానని నువ్వాశించడం వ్యర్థం.

కం—(L F నించి కొంచెం ఇవతలికి జరిగి) దేవుడోయ్! నా వెర్రిపిల్లాణ్ణి వీడు చంపేస్తాడత్రోయ్. ఇల్లా చూడు, మహానుభావా! నీకోపం నామీద చూపించు. నా ధనం, నా ప్రాణంకుడా పుచ్చేసుగో. కాని, నా బిడ్డని, ఈ యువకుణ్ణి, వదిలెయ్, దయ ఏమాత్రంఉన్నా.

హే—(ఆశ్చర్యపడుతూ) ఇదేమిటీ, మా ఆవిడే! ఎక్కణ్ణించి వచ్చిం దిక్కడికి! ఏమిటి ఈవిడధోరణి?

కం—(లేచి, అవతలమనిషి ఎవరో చూడకుండానే, అతడికి మోకరిస్తూ) మామీద జాలి వహించు, చోరా గ్రేసరా! మంచివాడవ్. మాసొమ్ములు, మా నగియా రాలు, మా సమస్తమూ పుచ్చేసుగో, ప్రాణాలు ఉండనీ. నీమీద కేసుపెట్టం, ఒఖనాటికి పెట్టం, తస్కరశిఖామణీ!

హే—ఈవిడికి మతి చలించినట్టుంది. ఏయ్, ఇదుగో, వినిపించుగోవేం, లక్ష్మీ! నేనూ, నేనూ!

కం—అయ్యో! ఇంతా చేసి మీరేనా! బతుకా బతుకు! భయంమూలాన్ని నాకు కనిపించాలేదు, వినిపించా లేదు. కాని, ఇంతదూరాన్ని, ఇంత భయంకర స్థలంలో మీరు కలుస్తారని ఎవరు అనుకోగలరూ? ఏమొచ్చారు మీరు మా వెనకాలే?

హే—లక్ష్మీ! నీకు మతి పోలేదనేమాట నమ్మ వచ్చా? 'ఇంతదూరాన్ని' అంటావేమిటి? మన దొడ్డి గుమ్మం ఇక్కడికి వందగజాలదూరం ఉంటుంది. (లకు ముకితో) ఏమోయ్, ఇది నీఅల్లరేగావును, మోటపశువా! (కంతాలమ్మతో) ఆగుమ్మం నీకు తెలియదూ, ఆ పట్టుపురు గులచెట్టూ! గుర్రాల గుంట అదుగో!

కం—ఆ ఆ. గుర్రాలగుంట చచ్చేదాకా మరిచి పోను. మరణం అంటే ఏముటో అందులో రుచి చూసా చ్చాను. (లకుముకితో) దీనికంతకీ కృతజ్ఞురాలినిగా ఉండ వలిసింది నీకేర్రా, మోటబానిసా! చెప్పిస్తానుండు, తల్లిని అల్లరిపెట్టడం!

ల—దేవుడుతోడు, అమ్మా! నన్ను పాడుచేసింది నువ్వే అని, దేశం అంతా అనుకుంటున్నారు. నువ్వూకూడా ఫలం అనుభవించుమరీ!

కం—ఇంకా పాడుచేస్తారా, కుంకా, పాడుచేసి తీరతారా. (అని, పళ్లు కొరుకుతూ వాణ్ణి తరిమి, వాడు R F కి వెళ్ళగా వాడివెనకాలే వెళ్ళిపోతుంది).

హే—వీడి సమాధానం మాత్రం మహా నీతి యుక్తంగాఉంది. (అని R F కి పోతాడు).

[L F నించి హృదయనాథమూ రంజనీ వస్తారు]

హృ—రంజనీ! ఎందుకీ ఆలస్యం? క్షణం ఆలస్యం అయినాసరే మనపని సర్వనాశనం. కాస్తంత ధైర్యం చిక్కబట్టుగున్నావా, ఆవిడ కోరల్లోంచి బయటపడతాం.

రం—వేగిరపడడం అసంభవంలా తోస్తోంది. అయిన అనుభవాలకి ఎంత కుంగిపోయానంటే, కొత్తప్రమాదం తల్పుగుంటే ఎదుర్కోడం ఎల్లాగా అని భయంవేసిపోతోంది. రెండు మూడేళ్లు ఓపికపడితే, సౌఖ్యం, పోనీ, అప్పుడే లభిస్తుంది.

హృ—అంత దీర్ఘాలస్యం చేసుగోడం, స్థిరచిత్తంతో ఉండకపోవడంకంటె అన్యాయం. పారిపోదాం, రా, ప్రేయసీ. సౌఖ్యం తక్షణమే సిద్ధిస్తుంది. ఆస్తిపోనీ, నాశనం కానీ! ప్రేమా తృప్తీ ఉంటే మహారాజు ఆదాయంకంటె ఎక్కువ అయేటట్టు మనకున్న ఆస్తిని పెంచుతాయి. నామాట విను!

రం—వినసండీ. వినను. బతుకు తెరువు చూపించే జ్ఞానమే శరణ్యం. అది చెప్పినప్రకారం ఆచరిస్తాను. ఉద్రేక వశులమై ఉన్నప్పుడు ఐశ్వర్యాన్ని కాళ్ళతో చిమ్మేస్తాం అనవచ్చుగాని, తరవాత శాశ్వత పశ్చాత్తాపంలో నిల్చిపోవాలి. అందువల్ల, హేమగిరిగారిదగ్గిర మొత్తుగుని, ఆయనకి జాలిపుట్టించి, న్యాయం జరిగి మనకి నష్టపరిహారం సంక్రమించేలాగ చెయ్యాలి.

హ్రా—ఆయన కొక్కడికీ ఇష్టంపుట్టి ఆయన నీకు సాయం చెయ్యదల్చినా, కొనసాగద్దూ ?

రం—అబ్బే! ఆయనకి కొంత ధీమా ఉందికదా ! దానిమీదే ఆధారపడ నిశ్చయించాను.

హ్రా—నాకు ఆశ ఎంతమాత్రమూ లేదు. నువ్వు కాదూకూడదూ అంటున్నావుగనక, అయిష్టం అయినాసరే నువ్వు అన్నప్రకారానికి ఒప్పుగుంటున్నాను, రా!

(అని R F కి వెడతాడు. వెనకాలే రంజని నిష్క్రమిస్తుంది).

# రంగం-7

[హేమగిరి ఇంటి సావిడిగదిలో హేమగిరీ పెదరాజూ కుర్చీలమీద కూచునిఉంటారు]

హే—అయితే, పెదరాజూ! ఆట్టే శ్రమపడకుండానే వచ్చేశావన్నమాట!

పె—ఆ. తెలిగ్గానే వచ్చేశాను. కాని, మావాడు ఎంతపనిచేశాడూ!

హే—అబ్బోఅబ్బో! (అని నవ్వి) నామీద మహాదాజ్ఞలు జారీచేశాడు. అప్పుడు మనిషి ఎంత రాజసపుకంఠం పెట్టాడనుకున్నావ్!

పె—నువ్వేదైనా చెప్పబోయినా చెయ్యబోయినా గమనింపే లేనట్టు ఉండేవాడుగావును!

హే—కాని, మామూలు హోటలుయజమాని కంటె విశేషం నాలో ఉండడం గ్రహిస్తూండేవాడను కుంటాను.

పె—అవును. నువ్వు అసాధారణపు హోటలు యజమానివని అనుకునేవాడు గావును (అని, నవ్వుతాడు.)

హే—ఆc. దానికేమిటీ? అతడు ఏమిచేస్తేం, నవ్వేసిపారేసేటంత సరసం నాదగ్గిర లేకపోలేదుగా! అవును, నేస్తం. వీళ్ళ సమ్మేళనద్వారా కుటుంబాలు కలిస్తే, మన

కున్న వ్యక్తిపరస్నేహం పారంపర్యం అవుతుంది. కాని నా కుమార్తెపేరట ఉన్న ఆ స్తిమాత్రం ఆక్టేలేదు......

పె—ఏమిటి గిరీ! ఆస్తిగురించా నాతో చెబుతావు! ఈవరకే మావాడిపేర బోలెడాస్తిఉంది. వాడికిప్పుడు లోటేమిటీఅంటే, వాడి సౌఖ్యం పంచుగుని పెంచగల చక్కని సుగుణవంతురాలు. వాళ్ళిద్దరికీ అన్యోన్యప్రేమ ఉంటే—ఉందనికదా నువ్వనాన్నావు?

హే—ఉంటే గింటే అంటూ సందేహిస్తున్నావా? వాళ్ళిద్దరికీ అన్యోన్యం ఉండితీరింది. మాపిల్ల నాతో ఆ మాట చెప్పేసినంత పనిచేసింది.

పె—ఏమో, చెప్పలేం. ఆడపిల్లలు ఒట్టి పుణ్యానిక ఆత్మస్తుతి కానిచ్చేస్తుంటారు.

హే—అబ్బ! హృదయపూర్వకంగా నాపిల్లచెయ్యి అతడు పట్టుగోడం నా కళ్ళారానే చూశాను. (RM కేసి చూస్తూ) అతడే ఇల్లా వస్తున్నాడు, నీ అయితేగియితే లన్నీ ఊడగొట్టేస్తాడు, నాదీ పూచీ. (LM కి చూపిస్తూ) నువ్వు అక్కడ ఉండి వింటూ, సమయానికి, రా.

పె—(LM కి వెడతాడు.)

ర—(RM నించి వస్తూ) అయ్యా! నా వింతప్రవర్తనగురించి ఇంకోసారి మిమ్మల్ని క్షమాపణ కోరుకుందాం అని వచ్చాను. నా పొగరుగురించి నేను ఆలోచన చేసుగున్నప్పుడల్లా నామతి శూన్యం అవుతోంది.

స్టే—ఛ, పోవోయ్, దానికేమిటీ! దాన్ని గురించి అంత మరీ తదేకంగా ఆలోచిస్తావేం? మా అమ్మాయితో నూంచుని గంటో రెండు గంటలో నవ్వేసుకుంటే సర్వమూ సుదటపడుతుంది. నేనెవరో తెలియక నువ్వు చేసినవి విని పించడంవల్ల మాపిల్లకి నీమీద మోజు తగ్గిపోతుందేమోఅని భయపడుతున్నావా?

ర—ఆవిడ అంగీకారం అమూల్యం. దాన్ని నేను సగర్వంగా స్వీకరిస్తాను.

స్టే—'అంగీకారం' కాదు, రత్నమణీ! ఈ సందర్భంలో ఆమాట చాలా చప్పగా ఉంటుంది. నువ్వు నోరు పోయావయ్యా అంటే చెప్పలేనుగాని, ఆవిడ దగ్గిర్నించి నీకు కేవలం 'అంగీకారం' కంటె ఎక్కువే ముట్టింది. బోధ పడిందా?

ర—నిజంగా అటువంటి సౌఖ్యం నాకేదీ దక్కలేదు.

స్టే—ఆఁ ఒప్పుగోవోయ్, అబ్బాయి. పదిఏళ్ళలో ఏమిటి ఏదో కుర్రపాడగట్టుక నీకే తెలియగాలేంది, బోలెడు సంవత్సరాలు సాగనంపినవాణ్ణి నాకు తెలియదూ? మీ కిద్దరికీ జరిగినచర్య నేను పూర్తిగా ఎరుగుదును. ఇంతవరకు చెప్పలేదు.

ర—(తీవ్రంగా) అయ్యా! నిశ్చయముండి. నేను ఎంత సమగ్రంగా మర్యాదగా ఉండాలో అల్లాఉన్నాను, ఆవిడ ఎంత ఎడంగా ముక్తసరుగా ఉండాలో అల్లాఉంది,

ఇంతకితప్ప మా కిద్దరికీ జరిగిన చర్య ఏమీ లేదు. ఏమి న్యాయమండీ, అయ్యా, నేను మీమీద కనబరిచిన పొగరు, ఇంటిల్లపాటిమీదా ప్రయోగించాననుకున్నారా?

హే—పొగరా? అబ్బే—నేను అల్లాఅనను. అబ్బెబ్బే, పొగరుకాదు. అయినా, ఎవరేనా తమతో కొంటెగా ఉండడం, శృతిమించేటట్టుగా కుడా ఉండడం కన్యలకి ఇష్టమే కదా! మాపిల్ల నాకు వెలిపుచ్చింది, కథకాదు.

ర—నే నా రీతిగా ఎంతమాత్రమూ ప్రవర్తించ లేదండి.

హే—సరే సరే. ఎవరేనా ఎప్పుడేనా సిగ్గుపడిపోయి ఏదేనా ఒప్పుగోకపోవచ్చు. కాని, అబ్బాయి, నువ్వు అతిగా అభినయిస్తున్నావు, ఒప్పేసుగో, అల్లా చేస్తివా, మీనాన్నకీ నాకూగుడా నువ్వంటే ఇష్టం ఎక్కువవుతుంది.

ర—నేను చచ్చిపోయినంత ఒట్టండి, ఎప్పుడేనా నేను......

హే—తొందరపడకోయ్. ఆవిడికి నీమీద అయిష్టం లేదు. సరి, నానమ్మకం, నువ్వు, ఆవిణ్ణీ...

ర—అయ్యా, నే నొప్పనండీ, మీ......

హే—అరే! వినిపించుగోవయ్యా! మీ యిద్దరికీ వివాహం జరగడానికి ఆటంకం ఈమాత్రమూ లేదు, పురోహితుడు మంత్రాలు చదవడంతప్ప.

ర—నన్ను వినిపించుగో రేమండీ!

హే—మీ నాన్నకీ ఈసంబంధం ఇష్టమే, నేను మెచ్చుతూనే ఉన్నాను. ఆలస్యం నిమిషమైనా చేసుగోడం అల్లరికి కారణం.

ర—నన్ను విననేమండీ? ప్రమాణపూర్వకంగా సత్యం యథార్థం చెబుతాను. వినయప్రభమీద నాకు ఆసక్తి ఉన్నట్టు ఆవిడికి నేను కించిత్తూ దాఖలా ఇయ్యలేదు. సరి గదా నాకు ఆవిడమీద మనస్సు ఉందని ఆవిడ దూరాన్వయం చేసుగుని అనుమానించడానికి వీలిచ్చే సూచన కూడా ఎదీ చెయ్యలేదు. ఒకసారిమాత్రమే మేం కలిశాం. ఆ సమావేశం అధికారికంగా ముభావంగా ఆసక్తిరహితంగా జరిగింది.

హే—(తనలో) అధికారికంగానూ ముభావంగానూ కనిపించే పోగరుగల ఈ అబ్బాయి చర్య దుర్భరం అవుతోందే!

[L M నించి పెదరాజు వస్తూండగా]

—రావయ్యా, పెదరాజు! విన్నావా నీకొడుకు బుకాయింపూ?

పె—ఆ. విన్నాను, విన్నాను. అయితే, రత్నమణీ! నువ్వు ఆ అమ్మాయి చెయ్యి పట్టుగోలేదూ? మరేమీ గొడవ చెయ్యలేదూ?

ర—దైవసాక్షిగా, లేదండి, నాన్నగారూ! నేను మీ ఆజ్ఞ శిరసావహించి ఇక్కడికి వచ్చాను. తోత్రుపాటు

లేకుండా ఆ అనాథాయుని చూశాను, అయిష్టం కలిగించుగో కుండా ఇవతల పడ్డాను. నా విధ్యుక్తధర్మం నేను ఆచరించి నట్టు నిదర్శనాలు ఇంకా చూపెట్టవలిసిందని నన్ను మీరు కోరగనిన్నీ, ఇన్ని తలవంపులు నాకు గలిగించిన ఈ కొంప లోంచి నేను లేచిపోతూంటే నన్ను ఆపరనిన్నీ ఆశిస్తున్నాను.

(అని, దీనంగా R F కి పోతాడు).

పె—వెళ్ళేటప్పుడు మావాడి త్రికరణశుద్ధి చూస్తే నాకు ఆశ్చర్యం వేస్తోంది.

హే—ఎంత బుద్ధిపూర్వక సాహసంతో నమ్మించ డానికి యత్నించాడో చూస్తే, నాకూ ఆశ్చర్యం వేస్తోంది.

పె—కాదు గిరీ! నా ధనగౌరవాలు పందెం. వాడు చెప్పేది నిజమే.

హే—ఉండు. (అని LM కేసి చూసి) అమ్మాయి వస్తోంది. అది చెప్పే యథార్థంమీద నా సౌఖ్యం నేను పందెం కాస్తాను.

వి—(LM నించి వస్తుంది).

హే—అమ్మా, వినయా! ఇల్లా రా అమ్మా. నేం నిన్ను ప్రశ్నలు వేస్తాంగాని, హృదయపూర్వకంగా అర మరలు లేకుండా సమాధానాలు చెప్పు. రత్నమణిగారు నీయందు ప్రేమానురాగాలు ఉన్నట్టు ప్రకటనలు ఏమన్నా చేశాడా?

వి—ఇటువంటిప్రశ్న ఇంత హఠాత్తుగానాండీ ? కాని, మీరు దాపరికంలేని త్రికరణశుద్ధితో కోరారుగనక-వారు ప్రకటనలు చేశారండి.

పే—(పెదరాజుతో) చూశావా, నేస్తం.

పె—అయితే అమ్మాయి, నీకూ మావాడికీ ఒక సమావేశమేనా అవుతా ?

వి—చాలా అయినాయండి.

పే—(పెదరాజుతో) చూడవోయ్, నేస్తం.

పె—తనకి నీమీద అభిలాష ఉన్నట్టు ప్రకటించాడా ?

వి—శాశ్వతమైన అభిలాష

పె—ప్రేమగురించి మాట్లాడాడా ?

వి—బోలెడు.

పె—అత్యాశ్చర్యంగా ఉందే ! ఇదంతా యథావిధిగా ?

వి—యథావిధిగా.

పే—ఏం, నేస్తం ? నీకు తృప్తి అయిందనుకుంటాను.

పె—అయితే, అతడు ఎట్లా ప్రవర్తించాడో చెప్పు, అమ్మాయి !

వి—ఆరితేరిన ప్రేమారాధకులు ప్రవర్తించినట్టే నండి. నా ముఖంగురించి ఆరిందావర్ణన చేశారు, తనకి

ప్రజ్ఞాలోపం ఉన్నట్టూ నాలో అధిక ప్రజ్ఞ ఉన్నట్టూ ఎంతో మాట్లాడారు, ఆయన హృదయం చెప్పేశారు, దుఃఖాంత నాటకంలోలాగ, కొంచెం ఉపన్యసించారు, తెచ్చిపెట్టుగున్న పరమసంతోషంతో ముగించారు.

సె—ఇప్పుడు నాకు పూర్తిగా నమ్మకం కలిగింది. స్త్రీల సమక్షంలో మావాడు చాలా మొహమాటంగానూ తలవంచుగునీ ప్రసంగిస్తాడు. ముందుకి చొరబడి క్షేమజం కనపరుస్తూ అతిశయోక్తులు చెప్పేరీతి మావాణ్ణి వర్ణించ డానికి పనికేరాదు. తను మరొకలాగ కనిపించడం వాడినల్లే కాదని నాధైర్యం.

వి—అయ్యో! నా త్రికరణశుద్ధి మీ కళ్ళఎదట ఋజువుచేసి మీకు పూర్తిగా నచ్చేటట్టు నేను చెయ్య గలిగితే, ఏమంటారూ? మీరూ, నాన్నగారూ వెళ్ళి ఆ తెరవెనకాల ఉండండి. ఆయన వచ్చి నాయెడల తన గాఢానురాగం ప్రకటించడం మీరు స్వయంగా చూడ వచ్చు.

సె—ఒప్పుగున్నాను. అల్లానే. నీవర్ణన ప్రకారం యథాతథంగా మావాడు ఉన్నట్టు తేల్తే, వాడివల్ల నేపొందే సౌఖ్యం ఆఖరైందన్నమాట.

వి—నా వర్ణనప్రకారం యథాతథంగా ఆయన ఉండ నట్టు తేల్తే, వారివల్ల నే పొందే సౌఖ్యం ప్రారంభమే కాదని, నాభయం. త్వరగా వెళ్ళి దాక్కోండి. ఆ (R B ! చూపించి) మూల!

(హేమగిరి పిచ్చిరాజులు R B కి వెళ్ళిపోతారు. అప్పు డప్పుడు తొంగి చూస్తూంటారు.)

వి—(కొంచెం వేషం తగ్గించి, దాసీపిల్ల వేషంలోకి మారి, ఇటూ అటూ కొంత సేపు పచారు చేస్తుంది.)

[R F నించి రత్నమణి వస్తాడు]

ర—ఏం, పిల్లా!

వి—తమదయ.

ర—వెళ్ళిపోడానికి ఏర్పాటు చేసేశాను. నీతో చెప్పి మరీ వెళ్ళిపోదాం అనుకుని వచ్చాను. కాని, వెళ్ళిపోవడంలో ఉండే బాధ, లోగడ ఎరగనుగాని, ఈక్షణంలో మొదటిసారి అనుభవిస్తున్నాను.

వి—(దాసీపిల్లలాగ) ఆ బాధలో అంత పెద్ద బ్రహ్మాండం ఏముందీ? మీ రే ఇల్లా చేత్తో తీసిపారేసినట్టు పారెయ్యొచ్చు. ఒకటి రెండు రోజులు గడిచేసరికి మీ బాధకి పట్టు సడలి పోతుంది—ఏ కారణంచేత బాధపడడం అర్థం అని మీ రిప్పుడనుకుంటున్నారో, అది వ్యర్థం అని మీకు తెలిసి పోతుందిగనక.

ర—(తనలో) అబ్బ! ఈపిల్ల నేచెప్పిన సంగతే తనూ చెప్పినా తన మాటరీతికి కొత్తవన్నె పెడుతూనే ఉంటుంది. (పైకి) అల్లాకాదు, పిల్లా! నా వెనకటిగర్వం అంతా ఇప్పటి గాఢానురాగానికి లొంగిపోయింది. చదువుల్లో

తేజాలు ఐశ్వర్యాల్లో హెచ్చుతగ్గులు తండ్రికోపం సాటివాళ్ళ నిరసన—ఇందులో ప్రతీదీ సారంలేని సబబు, అని, నాకు తెలియడం మొదలెడుతోంది. ఇప్పుడు ఎంతో బాధపడి యత్నంచేసి పట్టుపడితేతప్ప, నేను మళ్ళీ నాలో ప టట్ట లేను.

వి—అయితే, వెళ్ళిపొండి. ఆగవలసిందని మిమ్మల్ని మరేమీ బలవంతం చెయ్యను. మీరు మాటొచ్చిన అమ్మాయి యొక్క కుటుంబం ఎంతగౌరవం కలదో నాదీ అంత గౌరవమూ కలిగిందే అయినా, నా చదువూ తక్కువ కాకపోయినా, సమాన ఐశ్వర్యం లేనినాడు ఎక్కన విశేషాలు ఏమి అక్కరకొస్తాయీ? లేనిప్రజ్ఞ నాకు ఆరోపణచేసి, మీరిచ్చే అల్పాంగీకారంతో నేను తృప్తిపడడమే నాకు మిగుల్తుంది. అంతర్యంలో ఐశ్వర్యాన్నే లక్ష్యంగా పెట్టుకుని, మీరు ప్రకటిస్తూన్న ప్రేమానుకరణమే నాకు దక్కుతుంది.

(R B నించి హేమగిరీ పెదరాజూ కనిపించి: 'వీడొచ్చాడు,' 'దాక్కో—దాక్కో,' 'చప్పుడు చెయ్యకు,' 'పోనీఅల్లా తిరిగి ఎదరమూలకి వెడదామా' అనేమోస్తరు అర్థం ఇచ్చే సంజ్ఞలు చేసుకుని, మళ్ళీవెళ్ళి దాక్కోవాలి.)

ర—ఓ అమ్మాయి! దైవసాక్షిగా చెబుతున్నాను. ఐశ్వర్యాలోచన నాదృష్టిలో అల్పతమం. నీ అందమే మొట్టమొదట నాకంటికి గోచరిస్తా! నీఅందం ఎవర్ని తహతహ

బాధించకుండా ఉంటుంది? ఇప్పుడు నీతో ప్రసంగిస్తున్నానా,
నీ కొత్తవిలాసం ఏదో ఒకటి నాలో మెల్లిగా చేరుతూనే
ఉంది, నామనస్సులోని చిత్రాన్ని సమగ్రం చేస్తూనేఉంది,
దాని రూపాన్ని ఛాయపరుస్తూనేఉంది. నీలో ఏది మొదట్లో
నాటురకమైన సామాన్యత్వం అనిపించిందో అదే ఇప్పుడు
అరిందాగల నిరాడంబరత్వంలా కనిపిస్తోంది. నీలో ఏది
మొదట్లో అతి చొరవగల చనవు సమాధానం అనిపించిందో
అదే ఇప్పుడు ధైర్యంగల అమాయికత్వమూ బుద్ధిపూర్వక
మైన సుగుణత్వమూ మేళగించిన ఫలితం—అని తట్టుతోంది.

(L B నించి హేమగిరీ పెదరాజూ కనిపించి—'ఏమిటి
వీడు మాట్లాడుతూన్నదీ,' 'ఆశ్చర్యంగాఉందే,' అన్నట్టు
సంజ్ఞలు చేస్తారు.)

ర—అందుకని, ఓ పిల్లా! నేనిక్కడ ఆగిపోవడానికి
నిశ్చయించుకున్నాను. మానాన్నగారి విచక్షణ ఎంత మంచి
దంటే—నేనెరుగున్నంతవరకు—వారు నిన్ను చూసీచూడగానే
నిస్సందేహంగా తమ అంగీకారం ఇచ్చేస్తారు.

వి—వద్దండి, స్వామీ! నేను మిమ్మల్ని ఆపను,
ఆపలేను. పశ్చాత్తాపపడవలిసిన అవసరం లవలేశం ఉన్నా
సరే, అటువంటి సంపర్కానికి నేను ఒప్పందం అవుతాననుకున్నారా? మీ తాత్కాలికోద్రేకం సొమ్ము చేసుకుని నీచ
లాభం పొందడానికి మిమ్మల్ని చికాకుతో కుంగదీస్తాననుకున్నారా? మీ సౌఖ్యంలోంచి కోసి తెచ్చిన ముక్క నేను
సంతోషంతో ఆరగించగల ననుకున్నారా?

ర—నువ్వే నాకు ప్రసాదించగల సౌఖ్యంతప్ప, ఏ యితరసౌఖ్యమూ నాకు ఉండబోదు. నీ సుగుణాలు ఇంకా పెందరాళే కనిపెట్టుగోలేకపోయానే అని సెప్ప నేనెన్నడూ పశ్చాత్తాపపడను. నువ్వు కూడదన్నానసరే, నేనిక్కడ ఆగి తీరతాను. ఇక నువ్వు నన్ను తిరస్కరిస్తుండడానికే పట్టు పడతావనుకో, నా పూర్వప్రవర్తనలోని తేలికతనంవల్ల కలిగిన నష్టం పరిహారం అయేటట్లు సగౌరవంగా నిన్ను గురించి ప్రార్థనలు పదేపదే చేస్తూఉంటాను.

వి—అయ్యో! మీరు తొలిగిపోవలిసిందని మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను. మనపరిచయం ఎల్లా ఆరంభమైందో అల్లానే నిర్లక్ష్యంగా అంతంకానీండి, గంటో రెండుగంటలో కులాసాగా గడిపేశాం అనుకోండి. కాని, నిజంగా చెప్పండి, నేను సొమ్ముకోసమూనూ మీరు ఆలోచనలేకానూ సమావేశం అయినట్లు కనబడుతూండగా, ఈ సంపర్కానికి నేను తలఒగ్గగలనని మీరు అనుకుంటారా? నిర్భయుడైన ప్రేమారాధకుడియొక్క నిబ్బరమైన మోహప్రకటనలు నావంటిది ఎప్పటికైనా ఎగిరి అందుకోగలదని మీరు అనుకుంటారా?

ర—(మోకరిస్తూ) నిర్భయుంగలవాడు ఇల్లా ఉంటాడా? నిబ్బరంగలవాడు ఇల్లా ఉంటాడా? కాదమ్మాయి! నీ సుగుణాల్లో ఒక్కొక్కటి నాకు తెలుస్తూరాగా, నా అపనమ్మకం హెచ్చిపోతోంది, బెజారు జాస్తీ అవుతోంది. ఇంకా ఏమని...

పె—(RM నించి వస్తూ) మరి నేను ఊరుకోలేను. రత్నమణీ, రత్నమణి! నన్ను ఎంతదగా చేశావు? ఇదేనా నీమాటల్లో నిర్లక్ష్యం? ఆసక్తి రహితత్వం?

హే—ఇదేనా నీ గుండెల్లోని నిరసన? నీ అధికారిక సమావేశం? ఏమంటూ విప్పావు?

ర—ఏమనను? నాకు పరమాశ్చర్యంగా ఉంది. ఏమిటో ఇదంతా?

హే—ఏమిటో నే చెబుతాను విను. నువ్వు నీ చిత్తం వచ్చినట్టు అనాగలవు, అన్లేదని అనాగలవు! స్త్రీ అఖ్ఖర్లేదని నలుగురిలోనూ అనగలవు, ఏకాంతంలో స్త్రీని సంబోధించ గలవు! మా అందరికీ ఒక కథ చెప్పగలవు, నా కుమార్తెకి మాత్రం మరోకథ చెప్పగలవు!

ర—మీకూతురా? ఈ యువతి మీకూతురా?

హే—అవును, ఒక ర్తెకూతురు. నాకూతురే! మరెవరికూతు రవుతుందీ!

ర—అయ్యో దేవుడా!

వి—అవునండి. ఆ సన్నటి పొడుగాటి మెల్లకంటి ఆవిడ అనుకున్నారే మీరు, అనుకుని మందమందంగా మోహమాటంతో చాదస్తపు గాంభీర్యంతో ప్రసంగం చేశారే—ఆవ్యక్తిని నేనే. తరవాత స్త్రీల సంఘంతాలూకు ధైర్యమూ చొరవా ప్రియత్వమూ గలిగిన గిలిగిచ్చ సిం

హుణ్ణి అంటూ తిరోస్తా ఏవేవో అన్నాగే. ఆవ్యక్తి నేనే!
(అని నవ్వుతుంది).

రం—ఔౌర, చెప్పడా! ఇది భరించ శక్యంగా లేదు.
ఇది మరణాంకంటె చాప్రగా ఉంది. నే నిక్కడ్ణించి పోవ
నయం.

సీ—సరిసరి, వెళ్ళడం ఎందుకోయ్! వెళ్ళినయ్యం.
అదంతా ఏదో పొరపాటని తెలిసిపోయిందిగా! మేమూ
నవ్వేసి పారేశాం. నువ్వు వెళ్ళిపోడానికి వీల్లేదని శాసిస్తు
న్నాను, తెలిసిందా! మా అమ్మాయిమీదా అయినదానికి
ఏమీ అనుకోవు లే! వినయప్రభా! నువ్వు క్షమించెయ్యవూ?
ఓ. మేం అంతా క్షమించేశామయ్యా, బాబూ! ధైర్యం
తెచ్చుగో, మరీ!

(రత్నమణీ వినయా రంగం వెనక్కి జరిగి, L B కేసి
వెళ్ళి ఏదో గూడబలుక్కుంటారు. రత్నమణి R B కి వినయ
L B కీ వెళ్ళిపోతారు).

[L F నించి, ముందు కంతాలమ్మా, వెనకాల
లకుముకీ వస్తారు]

కం—లేచిపోయార్ట! పోతేపోనీ. ఎవళ్ళ కిష్టంమా!

సీ—ఎవరు లేచిపోయారూ?

కం—అన్నీ తెలిసిన నా మేనగోడలూ దాని ప్రియుడు
హృదయనాథంగారూనూ! పట్నంనించి వచ్చాడేం, మరి
మొగాముాటస్థుడితో కలిసి—ఆయనా!

పె—ఎవరూ, మా హృదయనాథమా? వాడు చాలా నిజాయితీమనిషి. అంతకంటె అర్థ్రాడు భూమ్మీద లేడు. ఆపిల్ల ఇంతకంటె తెలివితేటల్తోమరి ఎన్నుకోడం జరగదు.

పే—అయితే, నిశ్చయంగా, నేను అతడి సంబంధం గురించి గర్వపడుతున్నాను.

కం—సరే. పిల్లనంటే లేవదీసుకుపోయాడుగాని, పిల్ల ఆస్తి తీసుకుపోలేదుగా! అమ్మాయి వెళ్ళిపోయిన నష్టం కూడదియ్యడానికి ఆ ఆస్తి ఈ యింట్లోనే దిగడిపోయింది.

పే—లక్ష్మీ! ఎప్పుడూ డబ్బుమీదేనా నీ ముక్తాయింపూ?

కం—ఊరుకుందురూ! అది నావిషయం, మీది కాదు.

హే—అయితే, నువ్వెరుగుదువా, నీకొడుక్కి యుక్త వయస్సురాగానే, నీకొడుకు ఆపిల్లని పెళ్ళాడ్డం నిరాకరిస్తే, అప్పుడు ఈఆస్తి యావత్తూ ఆ అమ్మాయిదే.

కం—పోదురూ చెప్పొచ్చారూ! వీడికింకా వయస్సు రాలేదు. వీడు నిరాకరించేదాకా ఆగడం ఉచితం అని ఆ అమ్మాయి అనుకోనూలేదు.

[R F నించి హృదయనాథమూ రంజనీ వస్తారు]

కం—(తనలో) ఛీ. లేచిపోయిన ఘటాలు ఇంత పెందరాళే తిరిగిరావడమేమిటీ! నా కప్పుడే వీళ్ళంటే ఇష్టం ఇగిరిపోవడం మొదలెట్టింది.

హ్మా—(హేమగిరితో) అయ్యా, క్షమించాలి. మీ మేనగోడల్ని లేవదీసుకుని పారిపోవాలని నేను యత్నించాను. అందుకు శిక్ష ప్రస్తుతం నాకు మతిపోవడమే. ఆలోచించి, మేం వెనక్కి వచ్చేశాం. న్యాయానికి పైమెట్టు అంతఃకరణ గనక, మీ అంతఃకరణతో మొరబెట్టుగోవాలని మా ఊహ. ఈపిల్ల తండ్రిగారి యిష్టప్రకారం, మొదట్లో ఈవిడికి నా ప్రేమప్రకటించాను. మా ప్రేమోద్దేశాలు ధర్మగాహ్యాలే కావు.

రం—మానాన్నగారు గతించింది మొదలు, నిర్బంధం తప్పించుగోడానికి, నేను, మనస్సులోలేని ధోరణి పైకి ప్రకటించవలిసిన నీచత్వానికి ఒడిగట్టవలిసొచ్చింది. కొన్ని తేలికక్షణాల్లో నా మనోభీష్టం సిద్ధించేటట్టున్న తరుణంలో ఈ ఆస్తి వదులుకోడానికి కుడా సిద్ధపడ్డాను. అటువంటి మిథ్యలోంచి మళ్ళీ బయటపడి, దగ్గిరసంబంధం నేను చేసుగుంటేనేగాని నాకు రాకూడదుఅని ఉన్న ఆస్తి, మీదయవల్ల, వస్తుందేమో అని ఆశిస్తున్నాను.

కం—ఛీఛీ. నేటికాలపు నవలల్లోని కథలు ముగుస్తాయేం ఏడిసినట్టు, అల్లాఉంది ఈ మొర.

హే—ఎల్లాగటఉండనీ, తమసొమ్ము తమరు కోరుకోడానికి, వెనక్కి వీళ్ళు వచ్చేసినందుకు నాకు చాలా సంతోషంగాఉంది. అబ్బాయి, లకుముకీ, ఇల్లారా అమ్మా! ఈ పిల్లని నీకు నేనిప్పుడు ఇస్తానంటే, నువ్వు వద్దంటావా?

ల——వద్దంటేమాత్రం విలువ ఏముందండీ! నాకు వయస్సు వస్తేగాని నేను అనకూడదుటగా, ఆకాస్త నద్దనడ మానూ!

సో——మీఅమ్మ కోరిక ననుసరణంగా నీవయస్సు నేను రహస్యంగా ఉంచాను—అల్లా రహస్యంగా ఉంచడం ని అభివృద్ధికి దోహదకరం అవుతుందేమోఅని! కాని, ఈవిడ ఆ రహస్యరక్షణ దురుపయోగం చేస్తోంది గనక, ఇప్పుడు ఆరహస్యం బయటపెడతాను. నీకు యుక్తవయస్సు వచ్చి మూడునెలలైంది.

ల——వయస్సు వచ్చేసిందా? నాకు యుక్తవయస్సు వచ్చిందాండీ, నాన్నగారూ!

సో——ఆ. మూడు నెలలైంది.

ల——నాకు స్వాతంత్ర్యం వచ్చిందిగనక, దాన్ని మొట్టమొదట్లోనే ఎట్లా ఉపయోగపరుస్తానో చూడండి. (అని గబగబావెళ్ళి రంజని చెయ్యిపట్టుకుని ఎదటకి ఈడ్చుకువచ్చి)—

ఇందుమూలంగా సకల మానవులున్నూ గ్రహించవలిసిం దేమిటనగా! టమటాను లకుముకి అనే పేరు బరగుతూ గగనస్థల జమీందారునైన నేను, ఏస్థలానికీ చెందని పడుచు కన్య జాబిల్లి రంజని అనేపేరుగల దీన్ని, హృదయపూర్వకమైన న్యాయసమ్మతముకుడా అయిన భార్యగా, స్వీకరించను. కాబట్టి సదరు రంజని తన ఇష్టప్రకారం తను వెళ్ళాడి వచ్చును. లకుముకి మళ్ళీ తను తనలాగే ఉంటాడు.

ప—చాలా ధైర్యం కనపరిచావు, మహానుభావా!

హృ—ఎటువంటివాణ్ణి! ఆత్మస్నేహితుడనయ్యాను, అమ్మ [illegible]!

రం—ఎంత నిష్కల్మషాలిస్తున్నాక ప్రస్తావం. సాధించానా! [అని, ఉడుకుమోతుతనంతో L F కి లేచిపోతుంది.]

ర—పోనీ, ఆవిడ చెయ్యవలసింది, నే చేస్తాను.

(అని, హృదయనాథ రంజనుల చేతులు కలుపుతాడు)

[R B నించి వినయా రత్నమణి వస్తారు]

వి—హృదయనాథం! ఇవే నా హృదయపూర్వక అభినందనాలు. ఈవిడ కొంచెం తెమిలిస్తే నాకూ అభినందనాలు ఎప్పుడిస్తావా అని చూస్తున్నాను.

హృ—(వినయతో) మీ యుక్తులుమరి అవసరం లేదండీ. మీకు అన్యోన్యప్రేమ ఉందిగనక అతనికి మీరే, మీకు అతనే.

హి—(వినయా రత్నమణుల చేతులు కలుపుతూ) నేనూ అల్లానే అంటాను. ఈపిల్ల పుత్రికాధర్మం నిర్వర్తించినట్టే భార్యాధర్మంకూడా నిర్వర్తిస్తే నువ్వీ సంబంధానికి ఎప్పుడూ సంతోషిస్తూనే ఉంటావు, రత్నమణీ! కాని, భార్య కానప్పుడు ఈపిల్ల సామాన్య అనుకుని పొరబడ్డావు భార్య అయిందిగనక మరి పొరబడకు. మరి పదండి. నలుగురికీ పెళ్ళిళ్ళు—నలుగురికీ భోజనాలు!



భమిడిపాటి కామేశ్వరరావు

జననం ఏప్రిల్ 1897. పాఠశాలా విద్య - ఏలూరు, నర్సాపురం. కాలేజీ చదువు - కాకినాడ, రాజమహేంద్రవరం. 1918 లో బి. ఏ. (గణితశాస్త్రం), 1922 లో యల్. టి. నాటినించి వీరేశలింగం హైస్కూలులో గణితాధ్యాపకులు. పద్యపఠనంమీదా అభినయంమీదా ఆసక్తికలవారు.

జీవితంలోని వాక్చమత్కృతుల సేకరణ మొదటి కృషి. 'భారతి' కి 1926 నించి సంబంధం. చమత్కార సంభాషణలూ 'త్యాగరాజు ఆత్మవిచారం' అనే త్యాగరాజ రచనల సారమూ ప్రకటించారు. భాగయ్య, పర్వతాలు, శఠకోపం, జానయ్య, మాలోకం మొదలైన పాత్రల పరిచయం సర్కార్లలోనూ, రాయలసీమలోనూ, నైజాం ప్రాంతాలలోనూ కలిగించారు. ఇటీవలి నాటకాలూ కథలూ ప్రశంసలూ అచ్చు కానున్నవి.